సంపాదకుడు: శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి సంవత్సరం చందా ౩—౦—౦

# ప్రబుద్ధాంధ్ర

సంపుటం ౮ } రాజమండ్రి ౨౦ మే ౧౯౩౫ { ౯ వ సంచిక



# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

ఇవి యిప్పుడు విడివిడిగా అచ్చు అవుతున్నవి
వెల 100 పేజీలకు 0-4-0 రేటున వుంటుంది
తక్కువ వెల 0-1-0 ఎక్కువ వెల 0-4-0

తయారైనవి

1. గూడుమారిన కొత్తరికం వెల 0-2-0
2. కలంపోటు వెల 0-2-6
3. తల్లిప్రాణం వెల 0-2-6

అచ్చులో వున్నవి

1. ఇల్లుపట్టిన వెధవాడబడుచు 2. మార్గదర్శి

ఒక్కొక్క పుస్తకం వీ. పీ. చెయ్యము. వెల, పోస్టేజి లేబిల్సు రూపంగాపంపినవారికి బుక్కుపోస్టుగా పంపుతాము. దీనికి దానికి యిలా పంపుతే పోస్టుఖర్చులు ఎక్కువ అయిపోతాయి. కనక ముందు 2-0-0 చందాగా పంపినవారికి వెలకు, పోస్టేజీకీ ఆ 2-0-0 సరిపోయేదాకా చిన్నకథలపుస్తకాలు ఒక్కొక్కటి అచ్చుకాగానే పంపుతూ వుంటాము. ఒక సంవత్సరంలో ఈ రెండు రూపాయలూ తీరిపోతాయి.

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు
కళాభివర్ధనీ పరిషత్తు రాజమండ్రి

## ఆధునికాంధ్రవాఙ్మయం

### శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి

1 రక్షాబంధనం 1-0-0, 2 శ్మశానవాటిక 0-8-0, 3 వారకాంత 0-4-0, 4 గూడుమారిన కొత్తరికం 0-2-0, 5 కలంపోటు 0-2-6 6 తల్లిప్రాణం 0-2-6 7 విజయనగరరాజుల కథలు 0-2-0, 8 చిత్తూరు రాజుల కథలు 0-3-0, 9 ఢిల్లీచక్రవర్తుల కథలు, 0-3-0, 10 గోల్కొండనవాబుల కథలు 0-1-0 11 ప్రబుద్ధాంధ్ర అయిదో సంపుటం గ్లేజుకాగితాలు చక్కని బైండింగు 2-0-0.

### మునిమాణిక్యం నరసింహారావుగారివి

1 కాంతం కథలు 1-0-0, 2 నేనూ మాకాంతం 0-4-0, 3 ఉపాధ్యాయుడు 0-8-0, 4 వక్రరేఖ 1-0-0.

### మొక్కపాటి నరసింహశాస్త్రిగారివి

1 బారిష్టరు పార్వతీశం పథా 1-0-0, 2 ప్రతిబింబములు 0-12-0 3 ఏకోదరులు 0-8-0.

### రాయప్రోలు సుబ్బారావుగారివి

1 కవితాంజలి 1-0-0, 2 జడకుచ్చులు 1-0-0

### కురుగంటి సీతారామయ్యగారివి

తంజాపురాంధ్రనాయక రాజుల చరిత్ర. 2-0-0

### R. V. R. జగపతివర్మగారివి

1 పెద్దాపురసంస్థానచరిత్రము 1-0-0, 2 పద్మనాభయుద్ధము 0-12-0, 3 రామవిలాసము 0-10-0, 4 ఆంధ్రులకథలు 0-10-0, 5 ఆంధ్రదేశకథలు 0-12-0.

### టేకుమళ్ల అచ్యుతరావుగారివి

విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్ర 1-8-0.

### ప్రకీర్ణకాలు

1 మునిమాపు 0-12-0, 2 వకుళమాల 0-12-0, 3 విరిసెజ్జ 0-8-0, 4 వేయిస్తంభాలగుడిశాసనం 2-0-0, 5 మల్లికార్జునరావు 0-10-0, 6 ఆంధ్రహృదయం 0-8-0, 7 రత్నాపణం 0-8-0, 8 రసాంజలి 0-2-0, 9 వసంతము 0-4-0, 10 నాట్యోత్సవం 1-0-0 11 నాట్యాశోకము 1-0-0, 12 విమర్శకపారిజాతం 1-0-0, 13 ఆంధ్రనాటకసంస్కరణము 0-4-0, 14 తెనుగుతోబుట్టువులు 0-8-0, 15 కవి[illegible] 0-8-0.

**కళాభివర్ధనీ పరిషత్తు రాజమండ్రి**

ఈ విడుదల అమ్మకంలో

# ఐదుబహుమతులు

ఉన్నవి

26, 51, 76, 101, 126 నెంబర్లకు వరసగా

1-0-0, 2-0-0, 3-0-0, 4-0-0, 5-0-0 బహుమతిగా పంపిస్తాము.

## దీని సంగతి యేమిటంటే?

1 రక్షాబంధనం, నవల 362 పేజీలు వెల 1-8-0, 2 శ్మశానవాటిక, నవల 217 పేజీలు 1-0-0

3 వారకాంత, నాటకం 96 పేజీలు 0-12-0

## ఇవి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి గ్రంథాలు

3-4-0 వెలగల ఈ మూడుగ్రంథాలూ జూలై ఆఖరు దాకా 1-0-0 కు మాత్రమే యిస్తాము. పోస్టుఖర్చులు 0-9-0. అయితే వి. పి. లు చెయ్యము. ఈ 1-9-0 ముందే పంపాలి.

## ఆర్డర్ల వరస తేల్చే విధానం

ఆర్డర్లు మాకు చేరడం ప్రధానం కాదు. ఆర్డరిచ్చేవారు తమ ఆర్డరు, ఏ తేదీని, ఎన్నిగంటల, ఎన్ని నిమిషాలకు వ్రాస్తున్నారో తమ జాబులో స్పష్టంగా వ్రాయాలి. జూలై ఆఖరున ఇద్దరు ఘరానా మనుష్యులచేత ఆర్డర్లు వరస కట్టించి బహుమతులు పంపుతాము. ఇంకా వివరాలు కావలసివుంటే రిప్లయి కార్డు వ్రాయండి. ఆలస్యం చెయ్యకండి.

వీరాభివర్ధనీపరిషత్తు మెయిన్ రోడ్డు, రాజమండ్రి

# కూష్మాండలేహ్యము

ఇది రక్తపిత్తమునకు ప్రత్యేకౌషధము. దగ్గు, నసరు, ఎక్కిళ్లు, హృద్రోగములు, ఆమ్లపిత్తము పోగొట్టును. కాళ్ళు చేతులు లాగుట, కాలుచేతుల మంటలు నివారించును. ఎండిపోవుచుండెడి పిల్లలకు, పెద్దలకు, స్త్రీలకు పురుషులకు చాలా మేలుచేయును. శస్త్రాభిఘాతమువల్ల కలుగు వ్యధను తగ్గించును. రొమ్మున కెగతట్టిన అన్నరసమును కిందికి దింపును. స్త్రీసంగమమున ఇచ్ఛ, ధాతువృద్ధి, బలము, కాంతి కలిగించును. పౌను వెల రు 2-8-0

గంధర్వ ఫార్మసీ, ఇన్నీసుపేట—రాజమండ్రి

# మకరధ్వజము

షడ్గుణబలిజారితము. మూడుపుటలు చేసినది

ఆరోగ్యవంతులకు ఏవ్యాధిని అంకురింపనీయదు. తల నరయుట, శరీరము ముడుతలు పడుట కలుగనీయదు. వయస్సు ముదిరినా ముదిమి కనబడనీయదు.

శుక్రనష్టము కట్టును. నిస్త్రాణ, తాపము, నీరసము, ధ్వజభంగము, ప్రమేహములు పోగొట్టును. క్షయ, ఉబ్బసము, అతిమూత్రమధుమూత్రములు, పాండువు, ఉబ్బు, గుండెదడ, పోగొట్టును. రక్తవృద్ధి, వీర్యవృద్ధి, శరీరమునకు పుష్టి, బిగి, కాంతి, వర్చస్సు, నరములకు బింకము కలిగించును. సమస్తజ్వరములను తగ్గించును. ఆకలి పుట్టించును. జీర్ణశక్తి కలిగించును. స్త్రీలకును చాల మంచిది.

ఏకకాలమున అనేకరోగములను నిర్మూలించుటకు ఇంతకంటె మరియొకటిలేదు. తులం 12—0—0

# మలయచందనము

## సెగరోగమునకు పేరుపొందిన ఔషధము

పోటీలలో నెగ్గినది. నకళ్ళను చూచి మోసపోకుడు

ఈ క్రూరవ్యాధివలన బాధపడువారికి మా మలయచందనము నాలుగువందల నేండ్లనుండి గురుపరంపరగా వాడబడుచున్నది. ఇది సంస్థానములయందును రాజకుటుంబములయందును వాడుటకు కనిపెట్టబడినది. కావుననే పథ్యములేదు. పిచికారితో పనిలేదు. సెగరోగము తగిలినట్లు, మందు పుచ్చుకొనుచున్నట్లు యెవరికీ తెలియగూడదంటె మా మలయచందనమొకటే అందుకు తగినది. నకళ్లు బయలుదేరుచున్నవి. పరీక్షించకుండ ఏ యౌషధమును పుచ్చుకోవద్దు. గంధర్వ ఫార్మసీవారి మలయచందనమే కావలెనని కోరుడు. అనేక వైద్యులు సొంతమందులను విడిచి దీనిని వాడి విజయము, బహుమతులు పొందుచున్నారు. మూడుపూటలలో గుణమిచ్చును. ఎరుపు, తెలుపు, పచ్చసెగలకు ఇది రామబాణము. రస పిష గంధకములు చేరని మూలికాయోగము. ఇక్కడకు అక్కడకు పరుగెత్తక నేడే మాకు వ్రాయుడు.

డబ్బీ 2—4—0 దీని అనుపానము చందనతైలము ఔన్సు 3—0—0 రెండును ఖర్చులతో 6—0—0

గంధర్వఫార్మసీ ఇన్నీస్‌పేట, రాజమండ్రి




సంపుటము ౮ ] రాజమహేంద్రవరము: ౩౦ మేయి ౧౯౩౭ [ ౫ వ సంచిక

# రా జ రా జు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
సంపాదకుడు

## అయిదో రంగము

రాజరాజు విలాసమందిరం.

గడియ కిందటే వచ్చి చిత్రాంగి, సపరివారంగా అందులో విడిసింది.

ఆమె వెంట, చిలక కాక, అరణపు దాసీలు, రుక్కుతో కలిపి మరో యిరవై నుండి వచ్చారు. పదహారుగురు భృత్యులు కూడా వచ్చారు.

అయితే; రాజమహేంద్రపుర దాసీలూ, జక్కులదేవి భృత్యులూ కింద అంతస్తులోనే వుండిపోవాలనీ, పైకి రాకూడదనీ చిలక నిక్కచ్చిగా ఆజ్ఞాపించింది. జక్కులదేవి అరణపు దాసీలు మాత్రమే పైని వుండి పరిచర్య చేస్తూ వుండేటట్టున్నూ ఆమె యేర్పరిచింది.

అరణపుదాసీలలో కూడా, రుక్కు, తన రాక తెలియపరిచి లోపలకు వెళ్లవచ్చు. తక్కిన దాసీలు పిలిస్తే గాని లోపలకు వెళ్లకూడదు.

అప్పటికి రెండు గడియల పొద్దు మాత్రమే వుంది. జక్కులదేవి దాసీలు, సారె సామానులన్నీ యథార్హ్యంగా సద్దుతున్నారు.

చిత్రాంగి, వెనక వసారాలో, బాలీసుకిక ఆనుకుని రత్నకంబళీమీద కూచుని వున్నది. గుడికి వెళ్లిన మేకలా వున్నది; కాని ఆమె కాస్తయినా వుత్సాహంగా లేదు.

పక్కన కూచుని, చిలక, చిత్రాంగి ధరించి వున్న నగలలో అసాధారణంగా పైన వున్న నాల్గొక్కటి తీసి వాలిచి దంతపు బరిణలో వుంచుతున్నది. ఆమె కూడా పూర్తిగా నిరుత్సాహంగానే వున్నది.

అప్పటికి రెండు గడియల పొద్దు మాత్రమే వుంది.

---

చిత్రాంగి—అనుభవించడం తప్పనప్పుడు వనుకుంటే వచ్చిన తప్పేమిటి? నేనిప్పుడు అభిసారిక నయ్యే వున్నాను.

చిలక—(మాట్లాడదు)

చిత్రాంగి—అభిసారిక, ప్రియుణ్ణి వెతుక్కుంటూ సంకేతస్థలానికి వెడుతుంది. నేను తిన్నగా ప్రియుడి యింటికే వచ్చాను. ఈ తేడా మాత్రం వున్నది.

చిలక—(మాట్లాడదు)

చిత్రాంగి—అయితే; ఈసాహసానికి ఫలితం యేమిటి? ఈజన్మకి సాఫల్యం వుంటుందా?

చిలక—(గడ్డం పట్టుకుని చిత్రాంగిని బతిమాలుతూ) వద్దు తల్లీ! గోడలకి చెవు లున్నాయి మా అమ్మా!

చిత్రాంగి—ప్రియుడి యింటి గోడలికి కూడా చెవులున్నాయా ?

చిలక—(మాట్లాడదు)

చిత్రాంగి—సాఫల్యం మాట దేవు డెరుగును, ఇక్కడ కూడా యిలాంటి తపన వున్నట్టు తెలిస్తే గాని యీ జన్మకు కడ తేరడం యెలాగా ?

చిలక—అది సుఖసుఖాల తేడే విషయమా తల్లీ ? అసలే మహా—గంభీరులని బిరుదాయె. ఈసమయాన ఆగాంభీర్యం మరింత గంభీర మయిపోయి వుండదూ ? ఇంతకీ: తమలో తా మయినా మధనపడడానికి వారి కవకాశం వున్నదో లేదో ? సుబుద్ధి అయ్యవారు—(అర్ధోక్తి)

చిత్రాంగి—(చెవులు మూసుకుని) శివశివా !...... ఆపే రెత్తకే. నా ఆశలు కాయో పండో తేలిపోయే దాకా అయినా ఆభూతం నాకళ్లబడకుండా వుండేటట్టు చూడవే.

చిలక—వారు, షష్టిగడియలూ అయ్యవారిని విడిచి వుండరని వింటాం గదా, నే నేం చెయ్యగలనమ్మా ?

చిత్రాంగి—(నిరాశతో చేతులు విదుపుకొంటూ) శని......శనిగాడు. ఆదిలోనే వక్రించాడు. ఈసంగతి వా రిప్పటికి కయినా గ్రహించుకోకపోతే యేమిటి దారి ?

తెరలో

చిలకా !

చిలక—ఆ ! రావచ్చు.

(అప్పుడు రుక్కు వస్తుంది)

రుక్కు—మహారాజు దయచేశారు. దర్శనం కోరుతున్నారు.

చిత్రాంగి—వల్లకాదని చెప్పు. ఇంకా మించిపోలేదు, యీ పాటికి దయచెయ్యండని చెప్పెయ్యి.

చిలక—మీరుండండి తల్లీ ! (రుక్కుతో) ఏమిటే ?

రుక్కు—మహారాజూ, మహారుద్రయ్యగారూ వచ్చారు.

చిలక—ఊహూ !

రుక్కు—మహారాజు మొగం కలకల్లాడిపోతోంది.

చిత్రాంగి—ఆ మొగమ్మీద నిప్పులు పొయ్యి. వెళ్లు.

చిలక—(గడ్డం పట్టుకుని) మా అమ్మ కాదూ ! ఇవాళకి మీ కళ్లబడనివ్వను. మిమ్మల్ని చూడనివ్వను. అస లిక్కడికి రానివ్వనే రానివ్వను. ఏం, సరా ? ఇక వూరుకోండి అమ్మా !

చిత్రాంగి—(రుక్కుతో) ఎక్కడ వున్నారే ?

రుక్కు—కిందే వున్నారమ్మా !

చిత్రాంగి—(రుక్కుతో) మెట్లమీద కూడా అడుగు పెట్టడానికి వల్లకాదని చెప్పు. (చిలకతో) నువ్వు తొరగా వెళ్లి సాగనంపేసి రా.

చిలక—(లేచి రుక్కుతో) పదవే.

(చిలకా రుక్కూ వెళ్లిపోతారు)

చిత్రాంగి—వచ్చి గడియ కాలేదు. ముసలిరాజప్పుడే సిద్ధం. నాగతి యింతకి వచ్చేసిందా ? హా ! ఆడజన్మ యింత చుక్కనూలినదా ?......కాదు, కాదు. ఎదురుకుంటే మొగాడు ఉక్కిరిబిక్కిరయిపోతాడు. నే నెందుకు బెలపోవాలీ ? నా జన్మకు బుగ్గి చేసేసి, రాజు, తాను మాత్రం యేమి బావుకోగలడూ ? వీలు తప్పివచ్చేటట్లయితే, యీముసలిపీనుగుని సమూలంగా నాశనం చెయ్యకపోతే నేను చిత్రాంగిని కాను.

(అప్పుడు చిలక వస్తుంది)

చిత్రాంగి—బుద్ధిగా వెళ్లాడూ ?

చిలక—కీ లెరిగి వాతపెడితే వెళ్లక యేం చేస్తారు తల్లీ ?

చిత్రాంగి—ఏం జరిగిందీ ? అసలు, నువ్వేమన్నావు ?

చిలక—ఇది పూజాసమయం అని చెప్పాను.

చిత్రాంగి—(చిటికె వేస్తూ) సెబాస్ !

చిలక—పైగా, వ్రతానికి ఉద్యాపన జరిగేదాకా, తొలీనాడు జాము పొద్దువేళ మొదలు, మలీనాడు జాము పొద్దెక్కే దాకా పురుషుల కళ్లబడగూడ దనికూడా చెప్పాను.

శరు

చిత్రాంగి—దాంతో నవనాడులూ కుంగిపోయేలనట్టేనా ?

గారు)

చిలక—పూర్తిగా కుంగిపోయాయి తల్లీ! మొగమ్మీద కత్తివేస్తే రక్తం లేదు.

చిత్రాంగి—ఇక మిడసరి లగ్నం వేళ వస్తాడు. అంతేనా?

చిలక—అంతే తల్లీ!

చిత్రాంగి—బతికాం, నాలుగు రోజులు తక్కువ—అంతే కాదూ? ఆరు మాసాలు నిర్భయం.

చిలక—అవును తల్లీ! కాని వొక్క పని మాత్రం—(అర్థోక్తి)

చిత్రాంగి—ఏమి టదీ?

చిలక—భోజనం చేసి వొక్కమాటు మహారాణీ దర్శనం చేసుకుని రమ్మన్నారు. అది చాలా అగత్యంట. దాసిపిల్లలు చాలా మేల్లున్నాయి ట.

చిత్రాంగి—(లేచి) కాదని యెవ రంటారూ? తప్పకుండా దర్శనం చేసుకుందాం. కథ అంతా సవ్యంగా నడిచినా నాకు మొదట లభించేది అత్తయ్యగారి దర్శనమే. కథ అడ్డం తిరిగినా యిప్పుడు వారి దర్శనమే మొదట అవుతున్నది. చాలా సంతోషం. భోజనం కాగానే దర్శనానికి వస్తున్నా మని రుక్కు చేత వర్తమానం పంపు.

చిలక—అలాగే తల్లీ! ఒక్కమాటు అలా తోటలో తిరిగివద్దాం రండమ్మా!

చిత్రాంగి—పద.

చిలక—రుక్కూ!

తెరలో

వచ్చాను.

చిలక—స్నానానికి సకలమూ సిద్ధం చేయించు.

తెరలో

సరే.

చిలక—రండి తల్లీ!

(ఇద్దరూ వెళ్లిపోతారు)

ఆరో రంగం

రత్నాంగి నగరు. రమారమీ, అది, రాత్రి భోజనాల వేళ. తమక్షణాపు వసారాలో, రత్నాంగీ, విజయాదిత్యుడూ అబ్బాంల కానుకుని వొకరి కొక రెదురుగా కూచుని వున్నారు. రాజపురోహితుడు రుద్రంభట్టు విజయాదిత్యున కొక వక్కగా వొక బాలీసు దగ్గిర కూచుని వున్నాడు.

రంయి మని చల్లని గాలి కొడుతున్నది. ఆగాలికి విజయాదిత్యుని గిరజాలూ, కొంచెం నెరసివున్న రత్నాంగి ముంగురులూ కదులుతున్నవి. ఉండివుండి వొక్కొక్కరివ్వ, దక్షిణాభిముఖుడై వున్న రుద్రంభట్టుకి కొంచెం వుక్కిరి బిక్కిరి కలిగిస్తున్నది.

ఒక దాసి మైనగోరువంకలకూ, చిలకలకూ పంజరాలలో జామిపళ్లందిస్తున్నది. గౌరి అనే మరొకదాసి తలుపు ఆనుకుని రత్నాంగికి వెనక నుంచుని వున్నది.

---

విజయాదిత్యుడు—(రుద్రంభట్టుతో) తమ మాటలు చూస్తే యెటూ నిశ్చయించడానికి వీలులేకుండా వున్నది. పోనీ, యిది సెల విప్పించండి, బాగా జ్ఞాపకం చేసుకోండి. ఆమె, కత్తికి పూలదండ వెయ్యడం విసిరికొట్టినట్టున్నదా, మురుస్తూ—(అర్థోక్తి)

రుద్రంభట్టు—మురిపెమా? అదెలాగ మహాప్రభూ?

రత్నాంగి—తర్కం వద్దు. జరిగినది జరిగినట్టు సెల విప్పించండి బాబయ్యా!

రుద్రంభట్టు—చిత్తం అమ్మా! మనవిచేసుకుంటున్నాను. చిత్రాంగీదేవమ్మగారు, పరిచారిక తెచ్చి అందిచ్చిన ఆయొక్క పుష్పహారం స్వీకరించడమూ, మహారాజులుంగారి కత్తివైపుకి సుతారంగా తిరగడమూ, దానికి— పతిభావనతో టయ్యేవే — చిత్తగించాయా, వెయ్యడమూ, అలాగ వేసీ వెయ్యడంతోటట్టే—అది—ఎదీ? ఆయొక్క పూలదండ విచ్ఛిన్నం అయిపోవడమూ నున్నూ, నేను విభ్రాంతు ణ్ణాయి—(అర్థోక్తి)

విజయాదిత్యుడు—ఇప్పుడు తమ విభ్రాంతి మనకక్కరలేదు. ఆమె సంగతి సెల విప్పించండి. ఆమె మొగంమీద యేమయినా అయిష్టత కనపడినదా?

రుద్రంభట్టు—శివశివా! శివశివా! అయితే, మహాప్రభూ! ఆదండ తెగిపోవడంతో టట్టే—(అర్థోక్తి)

విజయాదిత్యుడు—తమరు నాప్రశ్న గమనించడం లేదు. వేసిన తరవాత గాని దండ తెగిపోలేదు. ఆవెయ్య

దానికి వెనకటి స్థితి నే నడుగుతున్నది. వేస్తూ వుండి నప్పటిదిన్నీ సెల విప్పించండి.

రుద్రంభట్టు—చిత్తం చిత్తం. అదే విన్నవించుకుం టున్నాను మహాప్రభూ! (స్మరణ అభినయించి) చూపు లలో కొంచెం నైశిత్యం కనపడింది. లజ్జ మాత్రం స్ఫు టంగా లేదు. సాధ్వసమున్నూ గోచరించలేదు. అలా అని అది అయిష్టత అనిన్నీ చెప్పడానికి వీలు లేకుండా వున్నది. పైగా, ఆపుష్పహారం యెత్తడంలో ఆమె యెదమజబ్బ అడ్డు రావడంవల్ల కళ్లల్లో యెలాంటి భావం—(అర్ధోక్తి)

రత్నాంగి—సరే లెండి. ఏదో అయింది. తమకి భోజనంవేళ అతిక్రమిస్తూ వుంది. తమర్ని శ్రమపెట్టాము.

రుద్రంభట్టు—అమ్మ అమ్మ! ఏంత మాట సెల విచ్చారు? ఇందులో నాకు వచ్చిన శ్రమ యేమి వున్నదీ?

(ఈసమయంలో రత్నాంగి, వెనక్కి గౌరికేసి చూ స్తుంది. వెంటనే గౌరి పళ్లెంతో ఫలాలూ తాంబూల మూ తెచ్చి రత్నాంగి యెదట వుంచుతుంది)

రత్నాంగి—(ఆపళ్లెం పుచ్చుకుని, లేచివెళ్లి భక్తితో రుద్రంభట్టుకి అందించి నమస్కరిస్తుంది.)

రుద్రంభట్టు—(లేచి, వినయంగా పళ్లెం అందుకుని, తాపీగా వొత్తుసాదులు స్ఫటంగా వుచ్చరిస్తూ) "యాః ఫలినీర్యా అఫలా అపుష్పా యాశ్చ పుష్పిణీః బృహ స్పతిః ప్రసూతా స్తా నో ముంచం త్వగ్ంహసః"

శ్లో॥ ఫలం మనోరథఫలం పుత్రపౌత్రప్రవర్ధనం।

యస్మాత్తస్మాచ్ఛివం మే స్యా దతశ్శాంతిం

ప్రయచ్ఛ మే॥

ఫలదానకల్పోక్తసంపూర్ణసకలఫలావాప్తిరస్తు. మా అమ్మా! సెల విప్పించండి.

రత్నాంగి—చిత్తం బాబయ్యా!

రుద్రంభట్టు—(విజయాదిత్యుడి కేసి తిరిగి సమ్ముడై) మహాప్రభూ! సెలవు దయచేయించండి.

విజయాదిత్యుడు—(లేచి దోసిలి వొగ్గి సమ్ముడై) నమస్కారాలు.

రుద్రంభట్టు—రాజద్వారే, రాజగృహే సర్వదా దిగ్విజయ మస్తు. వేదోక్తం పరిపూర్ణ మాయుష్య మస్తు. (కొంచెం వూగీన లాడుతూ) చిత్తం చిత్తం.

(రుద్రంభట్టు వెనక్కి వెనక్కి నడుస్తూ వెళ్లిపోతాడు. రత్నాంగి విజయాదిత్యుడూ యథాప్రకారంగా కూచుం టారు.)

విజయాదిత్యుడు—సరిగా గుర్తించకపోవడం కొంత, భయం కొంత, సహజమైన ఛాందసం కొంత—మొత్తా నికి రుద్రంభట్టుగారు జరిగింది జరిగినట్టు చెప్పలేకపో యారు.

రత్నాంగి—ఏది యేమయినా కావలసిన సంగతి తేలిపోయింది. సిగ్గువల్ల, ఆమె, ఝూసీ చూడనట్టు చూ స్తూ వేసినా, యిష్టం లేక, విధి లేక, విసిరికొట్టినా ఫలం వొకటే. పూలదండ తెగిపోవడం మంచిది కాదు. అది యెంతమాత్రమూ శుభసూచన కాదు.

విజయాదిత్యుడు—అదీ సంగతి. అయితే, ఆదిలోనే యీవ్యవహారం అశుభంగా ప్రారంభం అయినది. దాని పర్యవసానం యెలా వుంటుందీ? ఇంతటితో అయినా యీ అశుభం శాంతిస్తే అదొక దారే.

గౌరి—అమ్మా!

రత్నాంగి—(గ్రీవాభంగాభిరామంగా చూస్తూ) ఆ!

గౌరి—జక్కులదేవి పరిచారికలు వచ్చి దర్శనం కో రుతున్నా రమ్మా!

(రత్నాంగీ, విజయాదిత్యుడూ వొక్కమాటు గంభీ రంగా చూసుకుంటారు)

రత్నాంగి—తీసుకురా.

గౌరి—చిత్తం అమ్మా!

(రుక్కుసీ, మరొకదాసినీ వెంటపెట్టుకు వచ్చి గౌరి రత్నాంగికి యెదట "యిక్కడ నిలిచి మాట్లాడండి" అన్నట్టు స్థలనిర్దేశం చేస్తుంది. వాళ్లిద్దరూ నూతనవస్త్రా లూ, పసుపుకుంకుమలూ, ఫలాలూ వున్న పళ్లేలు రత్నాంగి యెదట వుంచి, ముందు రత్నాంగి కేసీ, తరు వాత విజయాదిత్యుడి కేసీ తిరిగి, వంగి, చేతులతో నేల అంటి కళ్ల కద్దుకుని, చేతులు కట్టుకుని నుంచుంటారు)

రుక్కు—మహారాణీ! మాతల్లి చిత్రాంగీ దేవమ్మ వారు క్షేమంగా చేరినట్టు విన్నపాలు చేసుకుంటున్నారు. మరిన్నీ, భోజనానంతరం దర్శనం చేసుకుంటున్నా మని మనవిచేసుకుంటున్నారు.

రత్నాంగి—(ఒక్కమాటు పళ్లేలు తాకి) చాలా సంతోషం. కనిపెట్టుకుని వుంటా మని విన్నవించు.

రుక్కు—చిత్తం అమ్మా!

(వాళ్లిద్దరూ మళ్లీ యథాపూర్వంగా రత్నాంగికీ, విజయాదిత్యుడికీ నమస్కరించి గౌరితో వెళ్లిపోతారు)

రత్నాంగి—గౌరీ!

గౌరి—చిత్తం అమ్మా!

(గౌరి ఒక్కమాటు రత్నాంగికేసి చూసి ఆయిద్దరికీ ఫలాలూ తాంబూలాలూ యిస్తుంది. అటూ యిటూ పరిశీలనగా చూస్తూ వాళ్లిద్దరూ మెల్లిగా వెళ్లిపోతారు)

రత్నాంగి—(విజయాదిత్యుడితో) ఏమి కావలసిన పిల్ల యేమయిందో, యెలా తెచ్చుకోవలసిన వస్తువు యెలా వచ్చిందో చిత్తగించారా? ఇలా అవుతుం దని యెవ రయినా అనుకున్నారా? పరమేశ్వరు డయినా యిది యిలా జరగా లని నిర్ణయించి వుంటా డంటారా మరిదిగారూ?

విజయాదిత్యుడు—గతం మరచిపొండి. ఇక భవిష్యత్తు ఆలోచించండి వదినా!

రత్నాంగి—ఇక వాకటే భవిష్యత్తు. చూస్తూ చూస్తూ వుండగా ఆకాశం అంతా కారుమబ్బులు కమ్మేశాయి. ఉరుములతోటీ, మెరుపులతోటీ కుంభవృష్టే కురుస్తుందో మరేమవుతుందో తోచకుండావుంది. మనస్సు మనస్సులో వుండడంలేదు.

విజయాదిత్యుడు—చాలా జాగ్రత్తగా మాత్రం వుండాలి.

గౌరి—అమ్మా!

రత్నాంగి—(కొంచెం వెనకవాటుగా చూస్తూ) ఏం?

గౌరి—(ముందుకి వచ్చి) తమకి ఆకలి లేదుట, కనక తమర్ని భోజనం చెయ్యవలసిం దని వర్తమానించారు అబ్బాయి.

రత్నాంగి—(విజయాదిత్యుడితో) విన్నారా?

విజయాదిత్యుడు—అదేమిటీ? అబ్బాయి యిప్పు డెక్కడ వున్నాడూ?

గౌరి—కింద, వుత్తరపు వసారాలో వున్నారుట బాబయ్యా!

విజయాదిత్యుడు—ఎవ రెవ రున్నారూ?

గౌరి—ఎవరూ లేరు. ఒక్కరే వున్నారు. సుబుద్ధి అయ్యవారు యిప్పుడిప్పుడే వెళ్లిపోయారు ట బాబయ్యా!

విజయాదిత్యుడు—(రత్నాంగి కేసి చూస్తాడు)

రత్నాంగి—బుల్లిబాబయ్య పిలుస్తున్నా రని చెప్పి పంపు.

గౌరి—చిత్తం అమ్మా!

(గౌరి గుమ్మంలోకి వెళ్లి, యీసంగతి చెప్పి అక్కడ వున్న దాసీని పంపేస్తుంది)

రత్నాంగి—నాయనకి యిక నిద్రాహారా లుండ వన్నమాట.

విజయాదిత్యుడు—(నిట్టూర్పు విడుస్తూ మొగం వంచుకుంటాడు)

రత్నాంగి—ఆంజంజాటంలో పడి అయినా యిదంతా మరిచిపోతా డేమో అనుకుంటే పెళ్లి అనే మాట కూడా వినిపించుకోవడం లేదు నాయన!

గౌరి—బుల్లిబాబయ్య యిక్క డున్నారు బాబూ!

రత్నాంగి—(వెనక్కి తిరిగి) నాయనా!

సారంగధరుడు—వచ్చా నమ్మా! (ఇలా అంటూ వచ్చి, చేతులు కట్టుకుని విజయాదిత్యుడి దగ్గిర నుంచుని) ఏమి సెలవు బుల్లిబాబయ్యా?

విజయాదిత్యుడు—(దగ్గిర కూచో మని స్థలం చూపిస్తూ) భోజనం మానుకోవడం యెందుకోయ్? దాని వల్ల యేమిటీ ప్రయోజనమూ?

సారంగధరుడు—(విజయాదిత్యుడు చూపించినచోట మంచెమీద కూచుని) మధ్యాహ్నపుభోజనం గురువుగా వుండడంవల్ల వుపాత్తం చేసిం దండీ!

విజయాదిత్యుడు—అదేమి మాటోయ్?

రత్నాంగి—నాయన, మధ్యాహ్నం కంచం దగ్గిర

కూచున్నాడు, లేచాడు. అంతే. నాలుగు మెతుకు లయినా పుచ్చుకోలేదు. సయించనే లేదు.

విజయాదిత్యుడు—(సారంగధరుడితో) అవునా? అబ్బే! నువ్వు బంతిని లేకపోతే అమ్మ భోజనం చేస్తారా?

సారంగధరుడు—(తల్లి కేసి ఆదుర్దాగా చూస్తాడు)

రత్నాంగి—పోనీ, బుల్లిబాబయ్యని యీపూట కిక్కడ వుండ మన మంటావా?

సారంగధరుడు—ఉండ మనండి అమ్మా! (విజయాదిత్యుడితో) ఉండండి బుల్లిబాబయ్యా?

విజయాదిత్యుడు—(రత్నాంగి కేసి చూస్తాడు)

రత్నాంగి—దయచెయ్యండి, తప్పదు. లేకపోతే, నాయన భోజనశాలకే రాను.

విజయాదిత్యుడు—(ఒక్కమాటు రత్నాంగి కేసీ, వొక్కమాటు సారంగధరుడి కేసీ చూసి) సరే మరి!

రత్నాంగి—గౌరీ!

గౌరి—అమ్మా!

రత్నాంగి—ఈపూట భోజనా లిక్కడే అని చెప్పి, చెల్లెమ్మగారినీ, పిల్లల్నీ తీసుకురా.

సారంగధరుడు—(ఉత్సాహం కనపరుస్తాడు)

గౌరి—చిత్తం అమ్మా!

విజయాదిత్యుడు—వా రెందుకు వదినా?

సారంగధరుడు—రానివ్వండి బుల్లిబాబయ్యా! ఏక బంతి అయి రెండు వారాలు కావస్తోం దండీ, (రత్నాంగితో) నేను వెళ్లి పిలుచుకు వస్తా నండీ అమ్మా.

రత్నాంగి—అంతకంటే కావలసిం దేమిటి తండ్రీ?

విజయాదిత్యుడు—అందరమూ కలిసి వస్తాం వదినా!

రత్నాంగి—అలాగే చెయ్యండి. (గౌరితో) సంగతి రామసోదెమ్మగారితో చెప్పి నువ్వు కూడా వెళ్లు. చూడూ, చంద్రశేఖరంబాబుని నడిపించావు సుమా!

గౌరి—(చిరునవ్వుతో) నడవ మంటే మాత్రం నడుస్తారా బాబయ్య?

విజయాదిత్యుడు—గుర్రం కావా లనకుండా వస్తే నడిచినంత ఫలం.

సారంగధరుడు—ఆగుర్ర మయినా అదీ యిదీ పనికి వస్తుందా? చింతవువ్వన్న గుర్రమే కావాలి.

రత్నాంగి—బాగా చెప్పావు. చిట్టితండ్రిని నిన్న పొద్దుట అనగా చూశాను. అప్పుడే కళ్లు కాయలు కాసిపోయాయి. నిద్రపోతున్నాడో యేమిటో పాపం!

విజయాదిత్యుడు—అప్పుడే నిద్రా? చిన్నమ్మకీ అతనికీ యిది దశావతారీ ఆట సమయం. మడతపేచీలు పెట్టి ఆమెని కెకూ్క కెకూ్క మనిపిస్తూ వుంటా డిప్పుడు. ఒకొక్కప్పుడు తల్లి కూడా విసిగిపోతూ వుటుం దతని తోటి.

రత్నాంగి—నిజంగా అలాంటి పిల్లల్ని సద్దగలిగితేనే యిల్లాలి చాతుర్యం. చెల్లెమ్మ అదృష్టం చాలాగొప్పది.

విజయాదిత్యుడు—ఆమెఅదృష్టం కంటే తమ ఆశీర్వచనం గొప్పది వదినా!

రత్నాంగి—మీ అన్నదమ్ముల గడసరితనమో?

విజయాదిత్యుడు—(చిరునవ్వుతో) చిత్తం చిత్తం. ఇప్పుడే వస్తాము.

(అందరూ లేస్తారు)

# ఆంధ్రులు-కాంగ్రెస్సు

( శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి )

ఎంత లేదన్నా సుమారు ౨౦ సంవత్సరాలనుంచి, ఆంధ్రులు కాంగ్రెస్ గహనంలో బడి వెనుకచూపు లేకుండా, విచక్షణలేకుండా, కంటకాలను లెక్కించకుండా, దీర్ఘప్రయాణం సాగించారు. లెక్కచెయ్యలేదు గాని, అప్పటినుంచీ అడపాతడపా ఎదురుదెబ్బలు తగులుతూనే వచ్చాయి. పెద్దవో చిన్నవో ముళ్లు గుచ్చుకుంటూనే వచ్చాయి. కాని పౌరుషం గల ఆంధ్రుడు వాటిని లెక్కచెయ్యలేదు. కష్టాలు ఎక్కువయినకొద్దీ, ఓర్పుతో నడక సాగించాడు. కాని చివరకు ఎంత దూరం వెళ్లినా, మృగతృష్ణలు, కంటకలతలు, మాత్రమే గాని, కనీసం చెలమగాని, నిలివెడు చెట్టుగాని ఆశ్రయం దొరికి లేదు. ఇకనైనా బుద్ధితెచ్చుకొని, వెనక్కు తిరుగుతాడా? ఇంకా ఇదే ఓపికతో నడక సాగిస్తాడా?

కాంగ్రెస్ కోసం ఆంధ్రులు సర్వసంగపరిత్యాగం చేశారు. ఇంచుమించుగా కలోన్ముఖమైన ఆంధ్రరాష్ట్రాందోళనమును వదిలి పెట్టారు; హిందీవ్యామోహంలో బడి కన్నతల్లి భాష కన్ను మూసిచారు. మన దేశపు వాతావరణానికి ఎంతవరకు అనుకూలిస్తుందీ అన్న ఆలోచన లేకుండానే హిందూస్థానీవేషం ధరించి తెలుగు వేషానికి తిలోదకాలిచ్చారు. ఈ దేశపు ఎండలకు గాంధీటోపీ సరిపోతుందా?, తలగుడ్డే కావలెనా? బనియను, చొక్కా, పైన జుబ్బా ఇన్ని వేసుకొని భరించగలమా? అనే ఆలోచన ఆంధ్రులు చెయ్యనేలేదు. ఆంధ్రంలో చాలినంత వాఙ్మయం ఉందా, లేదా? ఆంధ్రుల్లో ప్రతిభావంతులు ఉన్నారా లేరా అని ఆలోచించనేలేదు. మొన్నటివరకు సర్. రాధాకృష్ణుడు ఆంధ్రుడని ఎవ్వరికీ తెలీదు. ఇవ్వాళ గవర్నరయ్యేటంతవరకూ ఉద్యోగంలో రాఘవేంద్రరావు ఆంధ్రు డని ఎవరికి తెలుసు? ఇన్నిమాట లెందుకు? ఆంధ్రదేశములో నాలుగు మూలలా కడుపునకు చాలిన తిండి, కట్టుకోడానికి చాలిన బట్టా దొరుకుతున్నదో, లేదో ఎవ్వరూ ఆలోచించలేదు.

మన ఆంధ్రులు ఈగొడవల్లో పడి కొట్టుకుపోతుండగానే, అటు అరవవాళ్లు, ఇటు ఓఢ్రులూ, తమ పని తాము చల్లగా చక్కబెట్టుకోసాగించారు. ఆంధ్రదేశంలో మారుమూలలలో గూడ ఉన్న, ఉన్నతోద్యోగాలన్నీ అరవవాళ్లు ఆక్రమించుకున్నారు. అరవదేశంలో కావలసిన ప్రాజెక్టు లన్నీ తయారుచేయించుకున్నారు. యూనివర్సిటీలు స్థాపించుకున్నారు. వాఙ్మయాభివృద్ధి చేసుకున్నారు. ఇలాఉండే తమిళులు కాంగ్రెస్‌లో గూడా మంచి పలుకుబడి సంపాదించారు. కాంగ్రెస్‌కు అధ్యక్షు లయినారుగూడాను. ఇక ఓఢ్రులు గూడ తమ జనసంఖ్యకు తగినంత కన్నా ఎక్కువ తీవ్రంగానే ఉద్యమం నడుపుకున్నారు. సర్కారువారి చల్లని దృష్టిలో చల్లగా ప్రత్యేకరాష్ట్రం ఏర్పరచుకోగలిగారు.

మనవాళ్లకు "ఇంటి" సంగతు లిట్లా ఉన్నా, రచ్చలో నన్నా పలుకుబడీ, కీర్తీ, అధికారం, అభివృద్ధి, ఏమైనా కలిగాయా, అంటే మరీ పూజ్యమే! మొన్నటివరకూ కాంగ్రెస్‌లో కార్యనిర్వాహకసభ్యత్వం కూడా లేకుండా చేయబడ్డారు. చివరకు అనుసరించుకుని తిరగ్గా, తిరగ్గా, క్రిందటిసారి పట్టాభిగారిని ఉండనిచ్చారు. సరే నిరుడు అధ్యక్షత వచ్చేస్తున్నది ఆయనగారికి, అన్నారు. అన్యరాష్ట్రాల్లో ఉన్న మాలాటివాళ్లం గూడ ఆనందించాం మా ఆంధ్రుడు ఈసారన్నా కాంగ్రెస్ గద్దె ఎక్కుతాడు గదా అని. కాని ఏంలాభం? కన్నమ్మకే వాపి, పిన్నమ్మకే తీపి. అన్నట్లు మళ్లీ ఇదివరకొకసారి ఎక్కిన నెహ్రూనే ఎక్కించారు. చివరకి ఆంధ్రులకి ఓదార్పు వచనా లన్నా ముట్టలేదు. సరే చివరకి మా వాళ్లిద్దరు ముగ్గురికి కార్యనిర్వాహకసంఘంలో, స్థానాలిచ్చి సానుభూతి ఐనా చూపిస్తా రని ఆశపెట్టుకొని కూర్చున్నాం. చివరకు దానికి గూడా మొండిచెయ్యే చూపించారు. పోనీ ఈసంవత్సర మన్నా అధ్యక్షుడయ్యే ఆశామేఘాలేమయినా చూపుమేరలో ఉన్నా యేమో ననుకుంటే దానికి గూడ ఆంధ్రుడికి స్థానం లేకుండా ఆపదవి సుభాస్ చంద్రబోసుగారి కిచ్చారు.

ఇటీవల రాజేంద్రప్రసాదు ఆంధ్రదేశప్రచారానికి వచ్చి ప్రతిచిన్నగ్రామానికి కూడా వెళ్లి, అఖండసన్మానాలు జరిగించుకొని వేలకు వేలు కుమ్మరించుకుపోయారు. అదేదో ఒక ఊళ్లో, ఆర్థికంగా ఆవగింజంత గూడ అధికారం లేని ఆడవాళ్ల సంఘం గూడా ముడుపు చెల్లించుకున్నదిట. ఇంతకూ ఆయన ప్రచారం వల్ల ఆంధ్రదేశానికి వచ్చిన గౌరవంగాని ఉపకారంగాని చీమతల కాయంతయినా లేదు. పైగా ఈకాంగ్రెస్‌తో ఉన్న గౌరవం గూడా ఊడింది.

ఇంతేకాక మన ఆంధ్రుల్లో చాలామంది వ్యక్తులు, సంస్థలు గూడ ఔత్తరాహులంటే దేవతలుగానూ, అవతారపురుషులుగాను ఎంచి వారిని మాటలతోను మూటలతోను గౌరవించి వారి ఆజ్ఞల్ని శిరసావహించి, వారి వేషం ధరించి, వారి భాషను నేర్చుకొని, వారి దేవుళ్లని వారి ఆచారాల్ని దిగుమతిచేసుకొని ఏవిధంగా నైనా తరించవలె ననుకోటం సర్వసామాన్యం అయిపోయింది. ఆంధ్రదేశంలో సభలకు గాని ఏవైనా ప్రజోపయోగసంస్థలకు గాని అధ్యక్షులుగానో, ప్రారంభకులుగానో, శక్తికి మించిన వ్యయం భరించి అయినా, ఉత్తరాదినాయకులను ఊడిపడునట్లు చేయగలిగిననే ముక్తి నొందునట్లు తలంచెదరు. లేకపోతే తృప్తి లేదు. ఉదాహరణకోసం బెజవాడ దగ్గిర ఖద్దరుసంస్థానంవారు ప్రచురించిన రిపోర్టు ఒకటి చూపిస్తాను. వాళ్లు ఆమధ్య తొమ్మిదిరోజులు అఖండచరఖాయజ్ఞం చేశారట. అనేకమంది స్త్రీపురుషులు ఆతొమ్మిది రోజులూ రాత్రింబగళ్లు నూలువడికారుట. శ్లాఘనీయ మైన విషయమే! ఆనూలుతో బట్టలు నేయించి గాంధీగారికి పంపించినారుట. చివరకు కళ్లనీళ్లు వస్తున్నాయి. అదే గుడ్డ ఆంధ్రదేశంలో అల్లాడుతూ ఉన్న అనాధలకు ఎవరికన్నా పంచిపెట్టితే ఆనందంతో కట్టుకునే వారుగా!! ఆయనగారా గుడ్డను దిండుగలీబులు చేసుకున్నారుట. అందువల్ల ఆసంస్థానానికి గాని ఆంధ్రదేశానికి గాని వచ్చిన లాభం ఏమీ లేదు. ఇంతేగాక అందులోనే ఒక మహాశయుడు తన భార్యా జ్ఞాపకార్థం స్వంతఖర్చులతో ఒక భవనం నిర్మించి దానికి రాజేంద్రభవనం అని పేరు పెట్టుకొన్నాడుట. ఎందుకో? ఆభార్యాపేరే పెట్టితే ఆమె ఆత్మకు శాంతి కూర్చి, ఆంధ్రత్వం నిలవబెట్టవచ్చునుగదా! రాజేంద్రుడి పేరు బెట్టడంవల్ల వీరికి అతనివల్ల రాళ్లకు మన్నుకు అయ్యే ఖర్చయినా రావడము లేదుగదా!!!

ఇలాటి ఉదాహరణలు చూపించవలె నంటే వేలూ లక్షలూ ఉన్నాయి. తలుచుకుంటే అన్యరాష్ట్రాల్లో పడివున్న ఆడదాన్ని నాకే కడుపు తరుక్కుపోతున్నది. ఇంతటితో నయినా, ఆంధ్రుడు, ఔత్తరాహులతోనూ, కాంగ్రెస్‌తోనూ, హిందీతోనూ, సంబంధం పూర్తిగా వదులుకొని తన స్వంత సమస్యలు పరిష్కరించుకోడానికి ప్రయత్నిస్తాడా?? ఇంకా సర్వనాశనమే కాంక్షిస్తాడా?

# వ్యాఖ్యానములు

## నిజమైన ఆవేదనే: కాని దారి తప్పింది

"తెలుగుల మేలుకొల్పె, నుపదేశ మొసఙ్గెను రాష్ట్రమంత్రి, యాంధ్రుల విభవమ్ముఁ గోరి పలుదుఃఖములన్ వరియించె, నమ్మహోన్నతచరితుండు "కొండ" కులసాగరచంద్రుని ప్రాణవాయువుల్ వెడలక మున్నె మా తెలుగువీరులు తెత్తురు గాక రాష్ట్రమున్"

ఉభయభాషాప్రవీణులు, తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు తమ కొత్త గ్రంథం "రాష్ట్రగానం" లో మన తెనుగువీరులను యిలా వుద్బోధిస్తున్నారు.

రాష్ట్రగానం ప్రతీ పేజీలోనూ, యిప్పటికీ ఆంధ్రరాష్ట్రం యేర్పటనందుకు, చౌదరిగారికి కలుగుతున్న పరితాపం స్పష్టంగా కనపడుతున్నది. అయితే: అది ఆంధ్రోద్యమచరిత్ర తెలిసి కలుగుతున్న పరితాపంగా మాత్రం కనపడ్డంలేదు. "యిరువ దారు శరత్తులనాడె రాష్ట్రమున్ దెచ్చెద మన్న తెల్గులకు దీరవ కోర్కులు" ఇదీ దాని వరస.

తెనుగువారి కోరికలు తీరలేదు. నిజమే. ఎందుకు తీరలేదూ? ఎలాంటి దోహదమూ లేకుండా మొలిచిన మొక్క మొలిచినట్టే యెదుక్కుపోతుందా? పూసేసిన్నీ కాసేస్తుందా?

వ్యక్త్యపేక్షయా, చౌదరిగారికి, కొండా వెంకటప్పయ్యపంతులుగారంటే చాలా గౌరవం వున్నట్టున్నది. మాభాగే. అయితే, పంతులుగారు బతికే వుండగా ఆంధ్రులు రాష్ట్రం తేవాలనడంలో వున్న ఆంతర్యం యేమిటీ?

పంతులుగారు రాష్ట్రం తేవలసిన ఆంధ్రులకంటే భిన్నులా? లేక, అతీతులా?

పంతులుగారు కూడా ఆప్రయత్నంలో యెందుకు చెయ్యిచేసుకోరూ? వృద్ధులయి వుండిన్నీ, వారు, దక్షిణభారతదేశంమీద తమ అధికారం చెలాయించాలని ఉవ్విళ్లూరుతూ వున్న గుజరాతీల—హిందూస్థానీల తాఖీదులమలపరచడంలో తరుణులకంటే యెక్కువ వ్యగ్రోత్సాహం కనపరుస్తున్నారే? అది—లేక—అలాంటిది ఆంధ్రరాష్ట్రం విషయంలో కూడా నాకెందుకు చూపించరూ?

పంతులుగారే అందరికంటే ముందు రాష్ట్రప్రస్తావన చేసినవారంటే మా కాక్షేపణ లేదు; కాని ఆరాష్ట్రప్రస్తావన విడిచిపెట్టేసినవారిలో కూడా పంతులుగారే మొదటివారని చౌదరిగారు ఎరుగుదురా?

మరిన్నీ, చౌదరిగారు "ఆంధ్రుల విభవమ్ముఁ గోరి పలుదుఃఖములన్ వరియించె" నని పంతులుగారిని చాలా భూషిస్తున్నారు. ఇందులో ఔచిత్యం యేమీ కనపడదు. ఏమంటే? వారు లాఠీచార్జీలకు పాల్పడి వుండవచ్చు. జెయిళ్లకు వెళ్లివుండవచ్చు. సర్కారు శిస్తు చెల్లించనని నిరాకరించివుండవచ్చు; కాని యివి యేవీ ఆంధ్రుల కోసం గాని ఆంధ్రరాష్ట్రం కోసం గాని వారు అనుభవించలేదు. ఈదుఃఖాలు అనుభవించిన రోజుల్లో, వారు, ఆంధ్రోద్యమం పూర్తిగా విడిచిపెట్టేసి వుండినారు. ఆంధ్రరాష్ట్రంఅంటే క్షుద్రవాంఛ అనిన్నీ వారు దృఢంగా నిర్ధారణ చేసుకుని వుండినారు.

ఇలాగ పంతులుగారిని గౌరవించబోయాకే గాని, చౌదరిగారు, సంకల్పసిద్ధులు కాలేకపోయారు.

పైపెచ్చు,—

"తత్త్వ మెఱుంగలేక బహుధా భ్రమలన్ గుడువంగ నేల? యాంధ్రత్వము లేని నాడు కలదా మన కించుక యేని భారతీయత్వము? తెల్గువీరుఁ డొకఁడైనను కాంగ్రెసు గద్దె నెక్క నేతృత్వము మాపు భాగ్యమున కేటికి నోచకపోయె జెప్పుడీ"

"కలఁ గన మెల్ల నొడ్డినను, కాంగ్రెసుకై పడరాని బాధలన్ వలచిన, బందె కోర్చిన, లవంబును జంకక నెత్తు రొడ్డినన్ దెలుగుల త్యాగ మెల్ల విశదీకృత మైనది, యింటిలో పులన్ గెలువని నాడు నచ్చులను గెల్చుట యెట్లు పొసంగు జెప్పుడీ?"

ఆంధ్రసామాన్యంకోసం వుద్దేశించబడ్డ యీపద్యాలు విషవిస్తారైన ములుకులై పంతులుగారికే నాటుకుంటున్నవి. చౌదరిగారది గమనించలేదు.

మరిన్నీ వారు,

"అచ్చపు పర్యాయ్బో యిరువదారు శరత్తులనాడె రాష్ట్రమున్ దెచ్చెద మన్న తెల్గులకు దీరవ కోర్కులు; మొన్న మొన్న కి

వచ్చిన యోధ్రిథైంగసుల వేషాలు పూచి గొంచెం; నెన్నడో వచ్చిన కీమలకే నిగుడు వచ్చిన కొమ్ములు వెక్కిరించెడిన్ ''
అంటున్నారు.

ఏం ? ఇది యిలా ఎందుకు జరిగింది ?

నిజంగా, బ్రిటిషువారికి ఎలాంటి యిబ్బందీ కలిగించని—వారు అంగీకరించే వున్న ఒక రాష్ట్రం నిర్మించడానికే యిన్నైని ఆరు సంవత్సరాల పరిశ్రమ కావాలా?

కాలచక్రం నిలవదు. జనవరి మొదలు డిసెంబరు ఆఖరుకి పన్నెండు మాసాలు ౧౯౧౨ మొదలు ౧౯౩౮ ఆఖరుకి ౨౬ సంవత్సరాలు. సంవత్సరాలు అతివేగంగా గడిచిపోతాయి. లెక్క కూడా అతిసులువుగానే తేలిపోతుంది; కాని రాష్ట్రనిర్మాణానికి ఆశ వొక్కటే చాలదు. కోరిక వొక్కటే ప్రధానం కాదు. దీక్ష వుండాలి. ఏకాగ్రత కావాలి. తపన వుండాలి. "అయ్యో, కాలం గడిచిపోతోందే" అనే ఆవేదన వుండాలి. "ఛీ! ఇది సాధించలేకపోతే మన బతుకెందుకూ ?" అను పౌరుషం వుండాలి.

ఉంగరులో నోది లేకపోయినా లాభం లేదు.

ఇంతెందుకూ ? కొండా వెంకటప్పయ్యగారు రాజకీయాలలో ప్రవేశించి యెన్నాళ్లయింది? "పట్టాభిసచివు"లున్నా రాజకీయాలలోకి దిగి యెన్ని సంవత్సరాలయింది ? అటు రాజగోపాలాచారిసత్యమూర్తిగార్లున్నూ రాజకీయాలలో వేలుపెట్టి యెన్నాళ్లయింది ? ఇవాళ చూస్తే కాంగ్రెస్సులో వారి హోదా నేమిటి, వీరి హోదా నేమిటి ?

సర్వమూ సిద్ధ మయిపోయిన తరవాత—అసెంబ్లీ అభ్యర్థుల జాబితాను కడసారపు నిర్ణయం కూడా చేసేసిన తరవాత—గాంధీజీ నెహ్రూగార్లు రాజగోపాలాచారిగారిని తీసుకువచ్చి అమాంతంగా నెత్తికెక్కించడం వల్లనయినా కాంగ్రెస్సులో మన "కొండకులసాగరచంద్రుని" హోదా యెంతమాత్రపుదో చౌదరిగారు గుర్తించలేకుండా వున్నారా ?

అసెంబ్లీ అభ్యర్థిగా వుండ మంటే పాడుసిద్ధాంతం పట్టుకుని వేళ్లాడుతూ మన పట్టాభిగారు "ససేమిరా" అన్నారు. రాజగోపాలాచారిగారు "దొరికిందిరా సందు" అని గభీ మని ప్రవేశించారు. దీనివల్ల మన స్థితి యెంత అధ్వాన్న మయిపోయిందో చౌదరిగారు గుర్తించారా ? మన "సచివుల" రాజకీయ పరిజ్ఞానం యేపాటిదో వారు తెలుసుకున్నారా ?

జాతి నుద్బోధించవలసిన బాధ్యత నేటి ఆంధ్రకవులు మామీదమీద యెంత యెక్కువగా వున్నదో యెరుగుదుము. చౌదరిగారి రాష్ట్రగానం మంచి సమయంలో ప్రారంభ మైనందుకు మేము ప్రశంసిస్తూనే వున్నాము; కాని, మన మహామహానాయకులు మన ఆంధ్రజాతిని ఆభాసు చేయబూనుకున్న ఆంధ్రేతర్ల యెదట పిల్లులై వున్న సందర్భంలో—ఆత్మప్రత్యయం లేకుండా వున్న సమయంలో "మను" అనే భావమే కాక శబ్దం కూడా మరచిపోయి వున్న స్థితిలో అనవసరంగా వారిని ఆకాశాని కెత్తివేస్తూ "మీ సత్త్వంబున కడ్డు లేదు, చరిత్రార్థత్వంబు మీ సొమ్ము, నేపక్షంబో నూనిన నేమి లెక్క ?" "తెల్గుగడ్డ నేలింపగ బ్రహ్మసుద్రామలే చేరంబోలును తక్కు ప్రముఖులకై చింతింపగా నేటికిన్ ?" "మా మనసు దూకును రంగమందు, మీకష్టము వచ్చి నిల్వదని పట్టి మనగన్న జాడ లేదు" "మా తెలుగుజోదులు దీనికి నోహటిల్లనేలా ? యొకడొక్కడే జగము సంకెళ్లు దార్చుగదా క్షణంబునన్" అని వందిమాగధస్తోత్రాలు వల్లవేయ్యడం యేమీ బాగా లేదు.

మామిత్రులు సీతారామమూర్తిచౌదరిగారికి మంచి కవితాధార వున్నది. ఆవేశం వున్నది. వారి పుట్టుకలోనే కాక కవిత్వంలో కూడా కమ్మదనం వున్నది; కాని వారి దృష్టి నిశితంగా లేదు. ఆవేదన తప్పుదారిలో పడిపోయింది.

## సాంబమూర్తిగారిని లేచి రమ్మనండి

కాంగ్రెస్సు, ఆంధ్రజాతిపాలిటి తోకచుక్క. కాళరాత్రి. ఏల్నాటిశని. ఇనపగజ్జెలతల్లి.

ఈసంగతి కాంగ్రెస్సు నియంతల పరిముఖంగానే వెల్లడి కావడం చాలా బాగుంది. మన మహర్షి బులుసు సాంబమూర్తిగారి పేరు మీదుగానే విస్పష్టం కావడం

మరీ బాగుంది. డాక్టరు పట్టాభి సీతారామయ్యపంతులుగారి ఆంధ్ర రాష్ట్రీయసంఘాధ్యక్షత నవనవలాడిపోతూ వున్న సమయంలోనే యిది సహయోగం అయిపోవడం మరీమరీ బాగుంది.

అయితే; ఇది, కాంగ్రెస్సుని గాంధీగారాక్రమించుకున్న వెంటనే నిర్ధారణ అయిపోయిన సంగతి; కాని హిందీమానసపుత్రులు కావడంవల్ల కాంగ్రెస్సాంధ్రులు, అర్ధజ్ఞానం కోల్పోయి యిది తెలుసుకోలేకపోయారు.

జాతి మొత్తంమీద పతనం యింకా పూర్తి కాలేదు; కనక, యిది యవరికి తెలిసివుండడం చాలా అగత్యమే. ఆ ఆంధ్రయువకులకున్నూ బోధపడలేదు.

అంచేతనే ఆంధ్రోద్యమలత కొనలుసాగి, పూసి. కాని, ముప్పులు మూట కడుతూ వుండవలసిన ఆంధ్రభూమిలో కాంగ్రెస్సు ముళ్లడొంక అలుముకుపోయింది.

ఇంకెట్లో ఆంధ్రరాష్ట్రం యేర్పడుతుం దని మే మెప్పుడూ అనుకోవడం లేదు. ఏమంటే? జాతికి అది యెంత అగత్యమో అంత వాంఛ, అంత ఆవేదన, అంత దీక్ష, అంత ఏకాగ్రత లేదు. అది కావలసినవారెవరో, దాన్ని నిర్మించే అధికారం యెవరి కున్నదో, కార్యక్రమం యేమిటో, సమకూర్చుకోవలసిన సాధనసామగ్రి యేమిటో, విఘాతం కలిగిస్తూ వున్న ప్రతికూలశక్తు లేవో, గోతులు తవ్వుతున్న మిత్రు లెవరో యేమీ తెలవదు.

నిజంగా, ఆంధ్రరాష్ట్రమె కావలసి వుంటే, ఆంధ్రులు, గుజరాతీ మిల్లుపట్టులు కట్టరు. ఎప్పుడో చచ్చిపోయి వుండిన రాట్నంమీద నూలు ముట్టరు.

దేశంలో యెక్కడ యేమి జరుగుతున్నదో, తమ స్థితి యెలా తయారవుతున్నదో తెలుసుకోకుండా గొర్రెలలాగ బుర్ర వంచుకుని నడక్కపోరు.

కాంగ్రెస్సు సంపాదించడమే వస్తే ఆస్వరాజ్యం మనకు స్వరాజ్యం కాదు. అది బ్రిటిషు రాజ్యం కంటే అపాయకరమైన పరరాజ్యం.

రాజ్యం అన్నది యెప్పుడూ నోరున్నవాళ్లదే అని పసిపిల్లలకున్నూ బాగా తెలుసు. నిజానికి మనకూ, నోరున్నది. ఏమీ సందేహం లేదు; కాని ఆ మన నోట గాలి లేదు. అంచేతనే మనజాతి జీవచ్ఛవమై వున్నది.

ఎప్పటికయినా ఆంధ్రరాష్ట్రమే మనకి స్వరాజ్యం. స్వరాజ్యం అన్నది యేర్పడడమే తటస్థపడితే అది మన వొక్కళ్లదే కాదు. మరన్నీ మన వొక్కళ్ల వల్లనే రాదు. ఆంధ్రరాష్ట్రం, అలా కాక, మన వొక్కళ్లకే దఖలుపడుతుంది. మన వొక్కళ్ల వల్లనే సాధ్యపడుతుంది.

అది సంపాదించుకోగలిగిననాడే మన పురుషకారం వెల్లడి అవుతుంది. మన అస్తిత్వం ధ్రువపడుతుంది.

ఇప్పుడు గుజరాతీహిందూస్థానీల స్వరాజ్యంసంరంభంలో మన వాళ్లు చేస్తున్నది ఆందోళన కాదు. పనికాదు. పోరాటం కానే కాదు. మరేమిటంటే! అది, పూర్తిగా, "హిందీ [illegible] తాండవం"

* * * * * * * *

మన సాంబమూర్తిగారి లండను ప్రయాణానికి కారణం, అక్కడి అధికారులకు నచ్చచెప్పి ఆంధ్రరాష్ట్రం నిర్మింపించే ప్రయత్నాలు చెయ్యడానికని తెలుస్తున్నది. నిజంగా యిది సత్యమే కావచ్చు; కాని, పైపూతే కాని, యీ సత్యంలో, సత్యానికుండవలసిన స్వచ్ఛతా, సమగ్రతా, యోగ్యతా అణుమాత్రమూ కనపడవు. జపానునుంచి వస్తున్న సెల్యులాయిడుబొమ్మలు నిక్కంగానే వుంటవి; కాని, అవి లోపల వొట్టి డొల్లలు. ఈసత్యమున్నూ అలాంటిదే.

ఏమంటే? స్వీకరించిన కొత్త మురిపెంతో, సాంబమూర్తిగారు, ఆంధ్రరాష్ట్రవాంఛ పరమనీచమనీ, తుచ్ఛమనీ, పూర్తిగా నిరసించారు.

నాలుగు వేపులనుంచీ యీ నిందలూ, హేళనలూ వచ్చి చురుకూ చురుకూ గుచ్చుకోగా, అప్పుడు ప్రకృతిలో పడి, అపారమైన సద్యస్ఫూర్తి కలవారు కనక, తమ వుపన్యాసం సరిగా రిపోర్టు చెయ్యలేదని పత్రికావిలేఖకులమీద అక్రమమైన నేరం మోపుతూ "రాష్ట్రీయశాసనసభలలోనే కాక ఫెడరల్ శాసనసభలో కూడా అంగీకరింపబడితే గాని కొత్త రాష్ట్రం నిర్మించడానికి కొత్త యిండియా శాసనంలో అవకాశం లేదు కనకనూ, కాంగ్రెస్సువారు ఫెడరేషను ఏర్పడనివ్వరు కనకనూ, పూర్ణస్వరాజ్యం వస్తే గాని ఆంధ్రరాష్ట్రం యేర్పడడానికి వీలు లే" దని తాము చెప్పినట్టు తిరగాత వారు సవరించుకున్నారు.

అయితే, యిప్పుడు ఫెడరల్ శాసనసభ యేర్పడివున్నదా? లేనప్పుడు సాంబమూర్తిగారు లండను వెళ్లి యేమి ప్రయోజనమూ?

నేటివరకూ, వారు అది దిద్దుకోలేదు. సవరించుకోలేదు. ఉపసంహరించుకోనూ లేదు.

పైపెచ్చు పార్లమెంటరీ సంప్రదాయాలు నేర్చుకోడానికే అన్నారు; గాని, వారు, తమ లండనుప్రయాణానికి కారణం "ఆంధ్రరాష్ట్రనిర్మాణవిషయం కూడానూ" అని రహస్యంగా అయినా బహిరంగపరచలేదు.

ఇలాగ పూర్వాపరసందర్భాలు గుర్తించుకోని—సరిపుచ్చుకోలేని మన మహాపురుషులవారు, ఒక పెద్దవ్యవహారంలో లండను అధికారులకు నచ్చచెప్పగలగడం సంభవమేనా!

అసలు, వారికి, నిజంగా ఆంధ్రరాష్ట్రనిర్మాణవాంఛ వున్నదంటే యెలాగా నమ్మయ్యేదం?

బడ్జెట్టు సందర్భంలో ఆంధ్రరాష్ట్రప్రస్తావన చేసినందుకు స్వామిగారిని గద్దించిన సాంబమూర్తిగారికి—వెంకటప్పయ్యగారిచేత రసాభాసపు రాష్ట్రవిభజనతీర్మానం ప్రవేశపెట్టిస్తూ వుంటే గాంధీగారి వియ్యంకులను ప్రతిఘటించలేని సాంబమూర్తిగారికి—ఏకోశంలోనో

యేమారుమూలనో ఆంధ్రరాష్ట్రవాంఛ వున్న దంటే "సరే" అని యెలాగా సమ్మతించడం ?

తమకి ఆంధ్రరాష్ట్రవాంఛ వుండడమే నిజమైతే, సాంబమూర్తి గారు, అసంగతి వెల్లడిపరచడానికి భయపడవలసిన — కుండల్లో గుర్రాలు తోలవలసిన అవసరం యేమిటీ ?

ఆంధ్రరాష్ట్రం కావా లనడం అంటే దొంగతనం చెయ్యడమా? సేలం జిల్లాలో కల్లంగళ్లు ప్రారంభం చేయించడమా ?

పోనీ, అలా కాదు. "సాంబమూర్తిగారికి ఆంధ్రరాష్ట్రవాంఛ వున్నది. నిజంగానే వున్నది. తీవ్రంగానూ వున్నది. ఎప్పు డెప్పు డని వారి హృదయం వురకలు వేసేస్తూనే వున్నది" అనుకుందాం. ఒప్పుకుందాం.

అయితే, పార్లమెంటరీసంప్రదాయాలు నేర్చుకోడాని కంటే కాంగ్రెసుకార్యసంఘం అనుమతి యివ్వలేదని ఆగ్రహించి స్పీకరు పదవికీ అసెంబ్లీసభ్యత్వానికీ రాజీనామా యివ్వబోయారే సాంబమూర్తిగారు ? ఇప్పుడు వర్కింగు కమిటీ ఆంధ్రరాష్ట్రం సాధించడంకోసం కాంగ్రెస్సు మెంబరు లండను వెళ్లడం సుతరామూ పనికి రాదని ఝుమాయించి తిరస్కరించేసింది కదా, వారిక కాంగ్రెస్సు సభ్యత్వానికీ రాజీనామా యిచ్చేస్తారా ?

వేలు తెచ్చే ప్లీడరీనే యెడమకాలితో తన్నేసిన సాంబమూర్తి గారు, తమ జాతికి అపకారం చేస్తున్న కాంగ్రెస్సుని కూడా అలాగే సత్కరించి నిజమైన ఆంధ్రుడుగా—జీవంగల ఆంధ్రుడుగా నిలబడతారా ?

*  *  *  *  *

ఇక్కడ ముఖ్యంగా వొక్క సంగతి చెప్పవలసి వున్నది.

సాంబమూర్తిగారు సాహసవిక్రమాంకులే కావచ్చు. పట్టాభి సీతారామయ్యగారు మహాప్రతిభావంతులే కావచ్చు. వేంకటప్పయ్యగారు దేశభక్తులే కావచ్చు; కాని వారు ముగ్గురూ కూడా ఆంధ్ర రాష్ట్రం తేలేరు. వారి జీవితచరిత్రలలో "ఆంధ్రరాష్ట్రం సాధించా" రన్న ముక్క చేర్చబడే అదృష్టం వారికి లేదు.

ఏమంటే? మేము నిజం చెబుతున్నాము. ఉన్నది వున్నట్టు చెబుతున్నాము.

మనకి ఆంధ్రరాష్ట్రం కావాలా ? కావలసి వుంటే, మనం, మన దేశపు సరిహద్దులలోనుంచి గాంధిగారి కాంగ్రెస్సుని అవతలకి పడగెంటెయ్యాలి. బ్రిటిషువారితో సహకారం చెయ్యాలి.

ఈముగ్గురూ యీపని చెయ్యరు. కనక వారు రాష్ట్రం తేలేరు.

యథార్థంలో మనకి రాష్ట్రమూ కావాలి, బ్రిటిషువారు దీన్ని అంగీకరించే వున్నారు; కాని మన వుభయులకూ మధ్య ప్రవేశించి, యీగుజరాతీల కాంగ్రెస్సు, భేదతంత్రం ప్రయోగిస్తున్నది.

అరవల ప్రాతికూల్యం మాకు తెలవంది కాదు; కాని దానివల్ల మన కేమీ నష్టం రాదు. అది మన నేమీ చెయ్యలేదు. సొంతంగా బరిమీదకి వచ్చి, అది, మన నెదురుకోలేదు. కాంగ్రెస్సు ఆసరా చూసుకుని అది భరతవిద్య ప్రదర్శిస్తున్నది.

ఇందులో వున్న రహస్యం యేమి టంటే?

మనం ఆంధ్రరాష్ట్రం కావా లంటున్నాము. దానివల్ల కష్టం వచ్చినా, నష్టం వచ్చినా అనుభవించడానికి కోరి మనం సిద్ధపడుగున్నప్పుడు, మన అక్కరలను ఆక్షేపించడానికి ఈ అరవ లెవరు? కాని వారు రహస్యంగా ప్రతిఘటిస్తున్నారు. మనం వుభయులమే అయితే యీ ద్వంద్వయుద్ధంలో సులువుగానే మనం పైచెయ్యి కాగలం; అయితే, అరవలు గుండెబెదురుతో చాటుచాటుగా దెబ్బతీస్తూ వుంటే, ఆదెబ్బలు కాసుకోడాని కయినా అవకాశం లేకుండా, గుజరాతీల కాంగ్రెస్సు, బోసినోటి ముసిముసినవ్వులతో కౌగిలించుకున్నట్టు నటిస్తూ మనల్ని అణచిపెడుతున్నది. మన సాంబమూర్తిగారూ, మన పట్టాభిగారూ, మన వెంకటప్పయ్యగారూ యిదేమీ తెలుసుకోలేకుండా వున్నారు.

అసలు అగ్గి అంటూ వుంటే గాలి వచ్చి తోడవుతుంది. నిజమే. అయితే, అగ్గే లేకపోతే?

అలాగే, మనం కాంగ్రెస్సుని లెక్కచేసినంత కాలమే మనకు అరవల ప్రాతికూల్యం పెనుభూతం లా కనపడుతుంది. కాంగ్రెస్సుకి వుద్వాసన చెప్పేస్తే?

అరవల ప్రాతికూల్యానికి జడిసా మనం ఆంధ్రరాష్ట్రోద్యమం విడిచిపెట్టింది, కాంగ్రెస్సు మాయాజాలంలో యిరుక్కునా !

పిడతలో నూనె పిడతలోనే వుండాలి, బిడ్డ దీరగింజాలా వుండాలంటే అది సాధ్యపడే దేనా? అలాగే మేము కాంగ్రెస్సులోనే వుంటాం అంటే, మేము బ్రిటిషువారి అధికారాన్ని లెక్కచెయ్యం, కాని, వారు మాత్రం మాకు ఆంధ్రరాష్ట్రం యిచ్చెయ్యాలంటే యేమయినా అర్థం వున్నదా ?

*  *  *  *

తెలుసుకోగలిగితే, యిప్పుడు మన నెదుర్కుంటున్నవి రెండే సమస్యలు. అవేమి టంటే? మన కిప్పుడు ప్రధానం ఆంధ్రోద్యమమా, కాంగ్రెస్సా? అంటే, ఆంధ్రరాష్ట్రమా, స్వరాజ్యమా ?

ముందు మన మీసంగతి తేల్చుకోవాలి. ఏకకాలంలో యివి రెండూ యెప్పుడూ సాధ్యం కావు.

ఇంతే కాదు. పూనుకుంటే ఆంధ్రరాష్ట్రం యీక్షణంలో వస్తుంది. ఏం చేసినా స్వరాజ్యం యింతట్లో రాదు.

ఇప్పుడు మనం ఆంధ్రోద్యమాన్నే నమ్ముకుంటామా, పూర్తిగా బాగుపడతాము. కాంగ్రెస్సునే నమ్ముకుంటామా, నామరూపాలు లేకుండా పోతాం.

తుంగభద్రప్రాజెక్టు వెనక్కి వెనక్కి వెడుతూ వుంటే గుడ్లప్పగించి చూస్తూ ఊరుకున్నామే, కృష్ణారిజర్వాయరుస్కీము మూలపడిపోతే మిడుతూ మిడుతూ మాస్తూ వూరుకున్నామే, తోట్రిగడ్డస్కీము తుస్సు మంటే కళ్లు చిరతలు కమ్మి విభ్రాంతుల మయిపోయామే, విశాఖపట్నం మెడికల్ కాలేజీకి రికగ్నిషన్ రాకపోతే కుక్కిన పేల మయి వూరుకున్నామే, యిక మనమా స్వరాజ్యం సాధిస్తాము! మనల్ని కాంగ్రెస్సు మనుష్యులుగా భావిస్తుందా ?

ఏతావతా !

ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెస్సు సంఘం, సాంబమూర్తిగారి నెంత పొగడినా, వారివల్ల, జాలి, నలుగురిలోనూ చాలా లోకువ యి పోయింది.

వారు స్పీకర్ల సమావేశం జరిగిస్తా మని కంకణం కట్టుకున్నారు; కాని బాగా ముడిపడక అది జారిపోయింది. అసెంబ్లీహాలులో కంచే మాతరం పాటకచేరీ చేయించబూనుకున్నారు; గాని నిభాయించుకోలేకపోయారు. లండన్ ప్రయాణం కట్టారు: కాని అడుగు ముందుకి వెయ్యలేకపోయారు. అసెంబ్లీసభ్యతకూ, స్పీకరుషిప్ దాకా రాజీనామా యిచ్చేస్తా మన్నారు; గాని సాగించుకోలేక పోయారు.

దీనివల్ల మద్రాసుగవర్న మెంటులో వారి పలుకుబడి యేపాటిదో స్పష్టపడిపోయింది, మాహమ్మదీయులకు వారంటే యేమీ విశ్వాసం లేదని తేలిపోయింది. వారికి పార్లమెంటరీసంప్రదాయపరిజ్ఞానం చాలదని వెల్లడి అయిపోయింది. కాంగ్రెస్సు వలయంలో వారి మాటకి వూతం లేదని విదితపడిపోయింది.

ఈస్థితిలో వారు కాంగ్రెస్సుని అంటిపెట్టుకుని వుండడం ఆంధ్ర జాతి సహించలేదు.

గుజరాతీలూ, హిందూస్థానీలూ కలిసి, తరవాత రాజగోపాలా చారిగారితో మంతనాలు జరిపి, చివరి ముహూర్తంలో సాంబమూర్తిగారిని పోనులో నుంచోపెట్టి, ప్రాకుపరీక్షలో (వాదంలో) ఆచారిగారికి కూడా అవకాశం యిచ్చి, చివరికి, సాంబమూర్తి గారిని బడిపిల్లకాయను మందలించినట్టు మందలించడం ఆంధ్రులకు చాలా అవమానకరంగా వున్నది.

ఇది సామాన్య మైన వరుస కాదు. కాంగ్రెస్సులో మనవారి సత్తా యింత లిగానుగా వుండని వుత్తరప్రదేశం దాకా వెల్లడైయి పోయిన తరవాత కూడా ఆంధ్రులు చలనం లేకుండా పడి వుండడం అవివేకం.

ఆంధ్రసోదరులు, ఇప్పటికైనా మేలుకుని, వెంటనే సకలానికీ రాజీనామా యిప్పించి సాంబమూర్తిగారిని ముందు ఇవతలికి రప్పించాలి.

## పార్లమెంటరీశక్రటరీలు అనవసరం

కరంతుగారు తమ, పార్లమెంటరీ శక్రటరీ వుద్యోగం వదులుకుని వెళ్లిపోయారు.

వెళ్లిపోయా రంటే అది వూరికే వెళ్లిపోవడం కాదు.

కాంగ్రెస్సువారిలో అనేకులకు డబ్బుపిశలాటకం యెంత యెక్కువగా వున్నదో, అధికారవ్యామోహం యెంత ముదిరిపోయి వున్నదో, ప్రజాభిప్రాయాన్ని లక్ష్యపెట్టని ఉమ్మస్సు యెంత ముమ్మరంగా వున్నదో, ముఖ్యంగా రాజగోపాలాచారిగారి పదవీ కల్పన యెంత దారుణంగా వున్నదో వెల్లడిచేసి మరీ వెళ్లిపోయారు వారు.

తెలుసుకోగలిగితే, ప్రజలకు కళ్లు తెరిచే సన్నివేశం యిది. ఏమి టంటే ! పార్లమెంటరీశక్రటరీగా తాము చేయవలసిన దేమీ కనపడలేదు కరంతుగారికి. ఇది యథార్థం కావడంవల్లనే రాజగోపాలాచారిగారు, వారి స్థానే మరి వొకర్ని నియమించడం మానేశారు.

పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు అంటే చిన్నది కాదు. సామాన్యమైనది కాదు. మానవశరీరానికి నరాల నిర్మాణం యెంత ప్రధానమైనదో రాజ్యాంగంలో పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు అంత ప్రధానమైనది. దానిని నిర్వహించే మంత్రికి శక్రటరీగా వుండే వారి కేమీ పని లేదంటే—శక్రటరీ లేకపోవడంవల్ల ఆమంత్రి పనులు అడ్డిపోవడం లేదంటే మరి తక్కిన మంత్రులకు మాత్రం శక్రటరీ లెందుకూ ?

పార్లమెంటరీ శక్రటరీలు బోలెడేసి జీతమూ, వల్లమాలిన అల వెన్సులూ పుచ్చుకుంటున్నారు; గాని వూరికే వున్నారా ? తక్కిన శక్రటరీ లింకా రాజీనామా లివ్వలేదేమీ ? రాజగోపాలాచారిగా రయినా వారినుండి రాజీనామాలు కోరలేదేం ?

అనుభవించడానికి ప్రజల సొమ్ము తేరగా దొరికిందా ?

మధ్యరాష్ట్రాల మంత్రులలో వొక మంత్రి వుద్యోగం వదులుకుని వెళ్లిపోయినా ప్రభుత్వం నిలిచిపోలేదు. యథాప్రకారం అది సాగుతూనే వున్నది. మంత్రులు తగ్గినా నిలిచిపోని ప్రభుత్వం, పార్లమెంటరీ శక్రటరీలు లేకపోతే తక్కిన ఆగిపోతుందా ?

అసలు, మన రాష్ట్రంలో, మంత్రులే కొందరు పనిలేనివారున్నారు. మంత్రిపదవులే కొన్ని తగ్గించవలసి వున్నవి. అలాంటి స్థితిలో పార్లమెంటరీ శక్రటరీపదవు లయినా వెంటనే రద్దు చెయ్యక పోవడం అక్రమం కాదూ ?

ఈపదవుల పూర్వోత్తరం యేమి టంటే ?

అసెంబ్లీలో వున్న కాంగ్రెస్సువారిలో అనేకులు, జిల్లాలలో మంచి పలుకుబడి కలవారై వున్నారు. వారిలో అనేకులకు పదవులు చూపించవలసివచ్చింది. అంచేతనే మంత్రిపదవులు పదయినవి. అందరు మంత్రులకూ అన్ని శక్రటరీపదవులు కల్పించవలసివచ్చింది. ఇలాగ యిరవై మంది కయినా మంచి పదవులు కల్పించకపోతే రాజగోపాలాచారిగారికి ఆటకట్టే టట్టు కనబడింది.

ఇదీ వున్న రహస్యం.

కరంతుగారి ధర్మమా అని కాంగ్రెస్సుమంత్రాంగంవారు డబ్బు దగ్గిర యెంత జాగ్రత్తగా వుంటున్నారో తెలిసిపోయింది.

ఎన్నో పనులు సొమ్ము లేదని వెనకబెడుతున్న కాంగ్రెస్సు మంత్రుల ద్రవ్యవినియోగపద్ధతి యింత చక్కగా వున్నది.

రమది ప్రజాప్రభుత్వము ట. ప్రజలే తమ చేతిలో ప్రభుత్వాధికారం వుంచారు ట. అయితే, యిలాంటి పదవులు కల్పించుకుని డబ్బు ఆర్జించుకో మనా ప్రజలు కాంగ్రెస్సువారిని శాసనసభలకు పంపారు ?

## "కాలో హ్యయం నిరవధిః"

"మీ రిద్దరును ప్రారంభించిన నిరశనదీక్ష నీతిపై నాధారపడినది కాదు. తమకు సమ్మతములు కాని పనులు నిజముగా జరిగినపుడును జరిగినట్లు తోచినపుడును ప్రజలు నిరశనదీక్షను బూనుట అనుచితము. ప్రతి విషయములోను అట్టివారికి లొంగి ఆపనులను మానివేయు నెడల సంఘమున చీలికలు కలుగును"

అర్ధడాక్సు కాంగ్రెస్సువాద, ఏ. మాణిక్యం (సేలం) గారికి గాంధీగారు పంపిన తంతి యిది.

గాంధిగారి విద్యాంకుల నిర్బంధహిందీవిధానానికి అసమ్మతి తెలపడానికి మాణిక్యంగారు నిరశనదీక్ష పట్టారు. గర్భవతి అయిన ఆయన భార్యకూడ అదేవ్రతం పట్టింది; కాని భార్య శ్రమ చూడలేక ఆయన వ్రతం మానేశారు.

"ఇతడు నిరశనదీక్షను వదలకపోయిన యెడల ప్రజలు వివేకమును గోల్పోయి ఆందోళనము ప్రారంభింపగూడదు. ఒకడొకని శరీరమునకు బాధ కలిగించుట గూడ దౌర్జన్యమే గాని యిట్టి నిరశనదీక్ష మిక్కిలి అధికమగు దౌర్జన్యము. ఒకడు మరియొకని బాధించుటలో దౌర్జన్యము మాత్రమే కలదు; గాని కపటము లేదు. అహింసానిరతుడ నను మిషతో నొకడు నిరసనదీక్షను బూనునెడల అతడు ప్రజలను మోసగించినవాడు కూడ నగును. దీనిలో రెట్టింపు దౌర్జన్య మున్నది"

నిర్బంధహిందీ విధానానికే అసమ్మతి తెలపడానికి కె. ఎస్. జగదీశన్ గారు, మాంబలంలో నిరశనవ్రతం పట్టారు. ఇది విని గాంధీగారు తమ హరిజనులో రాసిన రాత యిది.

౧౯౩౪ నవంబరులో, సాధువరదరాజం పంతులు గారికి సలహా చెబుతూ, మేము "..... కాని నిరశనవ్రతం అవలంబించడం మేము ప్రశంసించలేము. నిరశనవ్రతం స్త్రీలకుకూడ నింద్యమైన పని. ఇది అసమర్ధతకూ, అనౌచిత్యానికీ గుర్తు" అని రాసి వున్నాము.

గాంధిగారే యీనిరశనవ్రతానికి సృష్టికర్తలు. ఎన్నో మాట్లు యెన్నో పనులకోసం వారీ పని చేసి వున్నారు. వారిని చూసే, ఇటీవల, దేశీయులలో కొందరీదుష్కృత్యానికి పూనుకునివున్నారు. పూనుకుంటున్నారు. కాంగ్రెస్సుకి అధికారం రాకపూర్వం భారతదేశపు జెయిళ్లలోనూ, అండమానులలోనూ వున్న రాజకీయఖైదీలకు ఈ వుపాయం గాంధిగారుపదేశించకుండా వుండలేదు. కాంగ్రెస్సువారు ప్రోత్సాహం చూపించకుండా వుండలేదు. అధికారం చేతికి వచ్చి తామే పరిపాలన సాగించవలసివచ్చాటప్పటికి వారికి ఇది కంటకప్రాయం అయికూచుంది.

ఇవాళ గాంధిగారే నిరశనవ్రతాన్ని నిరసించడం నీతిమాలిన పని. అందులో దౌర్జన్యం వున్న దనడంలో కూడా దౌర్జన్యం మిక్కుటంగానే వున్నది.

పైగా, మాణిక్యం జగదీశన్ గార్ల నుద్దేశించి "ప్రతివిషయము లోను అట్టివారికి లొంగి ఆపనులను మానివేయునెడల సంఘమున చీలికలు కలుగును" అనీ, "ఇతడు నిరశనదీక్షను వదలకపోయిన యెడల ప్రజలు వివేకమును గోల్పోయి ఆందోళనమును ప్రారంభింపగూడదు" అనీ గాంధిగారు రాసిన వాక్యాలలో మానవహృదయం యెంత మాత్రమూ కనపడ్డం లేదు.

తమ నమ్మకం విడిచిపెట్టలేక వారు చచ్చిపోయినా అంతేనా? వారి ప్రాణాలంత చవక అయినవా! నిర్బంధహిందీవిధానం విడిచిపెట్టేస్తే కాంగ్రెస్సు చచ్చిపోతుందా? ఇతరరాష్ట్రాలలో యీ విధానం అవలంబించలే దేమీ? దక్షిణదేశీయులు తమ మాతృభాషలకు నీళ్లు వదులుకోవలసిందేనా?

నామమాత్రమైన అధికారం చేతికి వచ్చినంత మాత్రాన్నే ఇంత రాక్షసపాలనం ప్రారంభించిన గాంధిగారూ, వారి అనుచరులూ, నిజంగా అధినివేశప్రతిపత్తి అయినా చేతికందితే — అప్పుడూ తామే మెజారిటీలో వుండడం తటస్థపడితేతూర్పున పొద్దు పొడవనిస్తారా?

కాని, ఒక విధంగా చూస్తే యిప్పుడీ గోతులు తయారు కావడం మంచిదే. తయారయివుండడం అవసరమే. వాటికి వినియోగం జరిగే సుముహూర్తం అదిగో దగ్గరదగ్గరకే వస్తున్నది.

### కనుచూపుమేరలోనే

కాంగ్రెస్సు నియంతలలో క్రిమినల్ లాయర్లుగా పనిచేసి ఆరితేరి వున్నవారు చాలామంది వున్నారే? ఏం, షరీఫ్ గారి విషయం వారెందుకు పరిష్కరించలేకపోయారూ? ఒక రిటైర్డుజస్టిస్సుని ఆశ్రయించవలసిన అవసరం యెందుకు వచ్చింది?

ఎంత వోపిక పట్టినా దారి తెన్నూ కనపడక, చివరికి విసిగిపోయి, యేకకాలంలో ముగ్గురు మంత్రులు రాజీనామా యిచ్చెయ్యవలసినంత నిరంకుశంగా ప్రవర్తించారే సీ. పీ. ప్రధానమంత్రి మహాశయులవారు! వారి విషయంలో యింకేమి విచారణ చేయించలేదేమీ?

రాజకీయఖైదీల సందర్భంలో రాజీనామా యిస్తామని బెదిరిస్తూ పెంచి, "అత్యుచ్చమైనటి విజయం" పొందివున్న యు. పి. బీహారు మంత్రులు, రాజకీయఖైదీలలో చాలామందిని యింకా జెయిళ్లలో మగ్గబెట్టే వుంచారే? దోషిని విడిచిపెట్టడంకంటే, నిర్దోషులను బాధించడం రాక్షసాంశ అనే అత్యుచ్చనీతితత్వం కాంగ్రెస్సునియంతలకు స్ఫురణకు వచ్చే పరిస్థితు లెప్పటికయినా కలుగుతాయా?

కాంగ్రెస్సు జీవితంలో, యివి మూడూ, పాతాళం చూపించే మూడు సుడిగుండాలు.

వీటివల్లవచ్చే అపాయం కాంగ్రెస్సుప్రముఖులతోనేపోదు లెక్కలేనంతమంది అమాయికప్రజలను గూడా అది చుట్టబెట్టుకుంటుంది.

సరిగా "ఏడు" రాష్ట్రాలలో స్వామ్యాట్టుల మయి వున్నామనే పొంగు, కాంగ్రెస్సువారి సంకుచితచిత్తాన్ని, మరింత సంకుచితపరిచి వున్నది. ఇంతలో, సుఖసుఖాల, అది దారికి వచ్చే చిన్నెలు లేవు.

అవతల ఫెడరేషను రూపొందబోతున్నది. ఇవతల ముస్లింలీగు వుచ్చులు బిగిస్తున్నది. అటు హిందూమహాసభ వుక్కిరిబిక్కిరి కలిగిస్తున్నది.

దేశానికి కాంగ్రెస్సువల్ల మూడే ముప్పు దూరంగా లేదు. కనుచూపు మేరలోనే వుంది.

## ఆధారములు

అని జనస్వామి కోదండరామశాస్త్రిగారి ఒక కథల సంపుటి. కొన్నాళ్లనుంచి, చిన్నకథా—ఖండకావ్యం — ఏకాంకరూపకం, అన్ని సారస్వతాల్లో వలెనే ఆంధ్రసాహిత్యంలో కూడా బహుళ ప్రచారానికి వచ్చాయి. తత్రాపి—చిన్నకథ రచన పెద్దకళ. దీనిని ప్రారంభించి పెడత్రోవలు పట్టకుండా సూటిగా నడిపించడం మరీ పూచీతో కూడుకొన్న పని—నవ్యసాహిత్యప్రియులలో ఈరచనను అవలంబించిన వారూ చాలా మంది. అకృతార్థులున్నూ అనేకమంది. ఈ కథానికాసంపుటం చదువుతూండగా మొదట కలిగేది కొన్ని కథలు బాగుంటవేమో అనే ఆశ. పిమ్మట వచ్చేది నిస్పృహతోడి నిట్టూర్పు. ఏమని అడగండి. ఉత్తమకథానికల కుండవలసిన ఘటనాప్రతిఘటనలతో కూడిన వస్తువైచిత్రి దీనిలో ఏకథకూ లేదు.

మధ్యమకథానికల కుండే పలుకుటందమూ, భావశిల్పమూ ఇందులో ఎక్కడనో గాని కనిపించవు. ఇక—ఈకథకుడు తన కున్న సంస్కారభావ సామగ్రితో ఈకథలను పన్ని లోకాన్ని బాగుచేయదలచినట్లు తోస్తుంది. గొల్లపిల్లవాడు అబద్ధముగా పులి యని యరచెను. అందరును వచ్చి లేదని వెళ్లిపోయిరి. నిజముగా పులి వచ్చెను. గొల్ల అరచెను. ఎవ్వరును రాలేదు. కనుక అసత్యమాడరాదు. అనే కథలోని నీతి ప్రచారంకంటే ఈకథాసంపుటి కథలలోని ఉపన్యాసాల విశేషం నాకు బోధకాలేదు. ప్రచారం కోసం వ్రాసిన కథలను ఎంత సమర్థులు వ్రాసినవైనా సహృదయుడు కళాపరంగా చదువుకొని ఆనందించలేడు. ఏమైనా ఈసంపుటము మొత్తముమీద నాకు చదవడానికి సహ్యములుగా వున్నవి 'ఘనాని' 'కన్నీటిచరిటాలు' అనే రెండు కథలూను. వీనిలో కూడా, ఎంతో అసహజత్వమున్నా కొన్ని ఘటనలు ప్రతిఘటనలూ వున్నాయి. కొంతకు కొంత భాషకూడా బాగుంది.

తక్కిన కథలలో 'తాయారు' మొదలైన వాటిలో చక్కని నడకే లేదు. 'ఆనందభంగము' వంటి కథల్లో ఏమీ విశేషం లేదు. భాష చాలా ఒడుదుడుకుగా వుంది మొత్తంమీద. సామాన్యసంభాషణలో 'ఆక్షేయోగం' 'ఆందోళన' వంటి మాటలు కృత్రిమంగా వుంటాయి. అవసరం లేనిచోట 'ఫ్రెండు' వంటి ఇంగ్లీషు మాటలు వాడడం లేవడితనానికి గుర్తు. రెండవభాగములోని కథల్లో అసలే కథాత్వమూ—చమత్కారమూ లేదు. వుత్త 'ఈసప్ ఫేబిల్స్' వలెగా వున్నాయి. మొత్తంమీద—ఈకథకుడు ఇంకో కథలసంపుటి వేయవలసివున్న దని నా అభిప్రాయం. వేసేముందు తెనుగులో మంచి కథానికారచయితల రచనలు చదివి ధోరణి అవగాహన చేసుకోవలసిందని ఆప్తబుద్ధితోడి నా సలహా. ఇ. హా.

## రాష్ట్రగానము

గాయకులు (గ్రంథకర్త) ఉభయభాషాప్రవీణ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, హైస్కూలు పండితులు. బాపట్ల. క్రౌను ౩౨ పేజీల గ్రంథం. వెల నాలు గణాలు. అంటిక్ కాగితాలు. అచ్చు ముచ్చటగా నున్నది. ఈగ్రంథం శ్రీ చల్లపల్లి రాజావారికి అంకితం చెయ్యబడ్డది.

ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన ఆవేశం చౌదరిగారి యీగానానికి ముఖ్యకారణం. ఇది ప్రశంసించతగ్గ విషయం; కాని భాషలో ఉత్సాహానికి తగ్గ పాటవం లేదు. పద్యరచనలో చౌదరిగారి చెయ్యి యింకా సరిగా తిరగలేదు. చాలా పద్యాలలో ప్రక్రమభంగం కనపడుతున్నది. "ఎన్నడో వచ్చిన పీనులన్ నిన్నను వచ్చిన కొమ్ములు వెక్కిరించెడిన్" ఇది అశ్రుతపూర్వం, "ముందు వచ్చిన చెవుల కంటే వెనక వచ్చిన కొమ్ములు వాడి" అనే సామెత యిలా మారిపోయింది. "ఒక్క సమేతముగ్ నిలువ నోడ్డెల కైవస మైన గడ్డలో" "గడ్డపై" అనాలి. "తెల్గుబిడ్డ నెదిరింపన బ్రహ్మ రుద్రాదులే వేరంజాలరు" వేరంజాలరు, కంటే "ఓపజాలరు" బాగుంటుంది. ఇలాంటి తేడా లక్కడక్కడ వుండినా, మొత్తానికి, గ్రంథం బాగున్నది. ఆంధ్రరాష్ట్రవాంఛ మళ్లీ రేకెత్తిన యీ సమయంలో యీరాష్ట్రగానం దేశీయులకు ఉత్సాహశక్తి కలిగించ గలదు.

మీసా లంటే చౌదరిగారికి చాలా ప్రేమగా వున్నది. ఆంధ్రులందరూ మీసా లుంచుకోవాలనే వారి ఆశ; కొనికై [illegible]కులను మాత్రం వా రనుగ్రహించారు. ఎవ రెంచేసినా పారసర్వోత్తము రావుగారూ, కొల్లిపర సూరయ్యగారూ, కోటి రెడ్డిగారూ, గద్దె రంగయ్యనాయుడుగారూ అయినా శాశ్వతంగా మీసా లుంచుకుని చౌదరిగారి నుత్సాహం కలిగించకుండా వుంటారని నమ్ముతున్నాను. "కొదమసూమ్మ దరక్కలవోలె" కంటె "[illegible]పువ్వుల్లా" వున్న రంగయ్యనాయుడు గారి మీసాలను, చౌదరిగారు, మన హాయింపు అనుగ్రహిస్తారని కూడా నేను నమ్ముతున్నాను.

ఏ. కే. మూర్తి

## సుభాషచంద్రబోసు

ఇందు బోసు గారి జీవితమును, కొన్ని యుపన్యాసములు నున్నవి. గ్రంథకర్త శ్రీమాన్ కొమాండూరి శఠకోపాచార్యులు ఎం. ఏ. బి. ఎల్ గారు. కాకినాడ. గ్లే.. కాగితములు. అచ్చు బాగుగనే యున్నది. క్రౌనుపరిమాణమున 108 పుటల గ్రంథము. మూల్యము ఆఱణాలు.

వ్యయప్రయాసల కోర్చి, ఆచార్యులుగారు, బోసుగారి జీవితమును నేటివఱకును ఇందు వర్ణించినారు. అనేకము లైన ఆధారముల ననుసరించి కూర్పబడినది: గాని యిది యొక గ్రంథమున కనుకరణమును అనువాదమును గూడ కాదు. స్వతంత్రరచన; కాని భాషలో లోపము లనేకము లున్నవి. ఆవిషయమున ఆచార్యులుగారికి శ్రద్ధ యున్నట్లుకూడ కనపడదు. ఇట్టి ఉపయుక్తగ్రంథములు రచించి ప్రకటింపబూనిన ఆచార్యులుగారు భాషావిషయమున అశ్రద్ధ చేయుట భావ్యము కాదు. వా. నా. శాస్త్రి.

## కలిక

(చిన్నకథలసంపుటం) భోగ్గుభాపిరాజుగారు రచించినది. వెల నాలుగు అణాలు, యువకార్యాలయం, తెనాలి.

శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు గొప్పకథకులే గాక యువకార్యాలయం ద్వారా చిన్నకథలసంపుటాలు కూడా ఎంతో కష్టపడి ప్రకటించి ఆంధ్రలోకానికి అల్పవ్యయములలోనే అందజేస్తున్నారు. ఆంధ్రులు వీరి ఉద్యమాన్ని ప్రోత్సహిస్తారుగాక !

వారి అగవప్రచురణం "కలిక" ఈ కథాసంపుటి కర్త భోగ్గుభాపిరాజుగారు. భాపిరాజుగారిని ఆంధ్రలోకం అధునిక మహాకవిగా ఎరుగును. ఆయన మహాకవే గాక గొప్ప కథకుడని కూడా ఈ సంపుటి తెలియచేస్తూంది. ఈ సంపుటంలో తొమ్మిది చిన్నకథలు న్నాయి. కథకునికి ఉండవలసిన భాషాపాండిత్యం ఈయనికి పుష్కలంగా ఉంది. కథలు చెప్పే నేర్పు గొప్పకథకునికి అవసరమయినంతా ఈయనికి ఉంది. ఈసంపుటంలో గంభీరమైన (Serious) కథలేగాక హాస్యరసకథలు కూడా ఉన్నాయి.

నాకళినయాభిప్రాయం ఈకిందిది. భాపిరాజుగారు హాస్యకథలు రాయడంలో చూపించిన నేర్పు గంభీరమైన కథలలో చూపించలేదు. అంత బొత్తిగా లేదనికాదు. "విధి" అనేకథ బహుముఖ్యంగా రచించారు. కాని హాస్యకథలో! అవి అద్భుతంగా ఉన్నాయి. వీరు రచించిన "చిల్లిచెంబు" కథ నేటి హాస్యకథల సెలక్షన్సులో ప్రకటింపతగింది. అంతి చక్కనికథ. మిగిలినహాస్యకథలు "దొంగవెయ్యాలు" "కిటికీరెక్కలు" చక్కగా ఉన్నాయి. హాస్యధోరణిలోనే రచింపబడిన కథ "పుణ్యాత్ములు" గంభీరమైన కథలలో కూడా హాస్యగాయలు అనవసరమైనచోట్ల అక్కడక్కడ కనబడి వాటిని రుచిహీనం చేస్తున్నాయి.

భాపిరాజుగారి కథారచనలో నాకు కనబడే లోపమీకిందిది. అలంకారికశైలికి ఒకహద్దు ఉండాలి. పద్యాలలో లెక్కలేనన్ని అలంకారాలు వాడుతూన్నమాట నిజమే. అందులోనూ అధికంగా వాడేగా అపద్యాలు అసహ్యంగా ఉంటూన్నమాటా నిజమే. కాని వచనంలో అలంకారానికి పద్యంలోఉన్న తావులో నాలుగోవంతేనా లేదు. శైలి వీలయినంత సహజంగా ఉండడమే వచనానికి సుగుణం. ఈగుణం కనకి భాపిరాజుగారి రచనలో ఉంటే బంగారానికి పరిమళి మబ్బినట్టుగా వుంటుంది.

వైశ్యశిలాలంకారుడును, మహాకవియు, హాస్యరసప్రవీణుడును అయిన భాపిరాజుగారి కథకనైపుణ్యాన్ని కూడా ఆంధ్రదేశం చవిజూచుగాక ! యువకార్యాలయంవారు ఇటువంటి గ్రంథాలు మరికొన్ని ప్రకటించి ప్రశస్తమైన కథావాఙ్మయం తెలుగుదేశంలో వృద్ధిచేస్తారుగాక ! ఓరుమళ్ల కామేశ్వరరావు

## ఆయుర్వేదప్రభాతము

ఇది మాసపత్రిక. తూర్పు గోదావరిజిల్లా దేశీయవైద్యసంఘము తరఫున ప్రచురించబడుతున్నది. సంపాదకులు ఆయుర్వేదాచార్య తేజోమూర్తుల గురునాథం ఏ. ఎం. ఏ. సి. గారు. రామచంద్రపురం తూర్పు గోదావరిజిల్లా. సంవత్సర చందా ౨-౦-౦. రాయలు సైజున ౩౦ పేజీలు.

సంపాదకుల ఉద్దేశాలు చాలా చక్కగా నున్నవి. ఈమొదటి సంచికలో వాటికి తగిన రచనలు తక్కువగా వుండినా క్రమంగా ఆలోపం తీరుతుం దని నమ్ముతున్నాము. సంపాదకులు సమర్థులు. ఆవేదన కలవారు. పత్రికను సర్వలక్షణసంపన్నంగా నడిపించగలవారు. ద్రాక్షాసవానికి సంబంధించిన వ్యాసంలో మరికొన్ని వివరాలిచ్చి వుంటే చాలా బాగుండేది. అందులో సవరణలు కూడా చెయ్యవలసివున్నది. అయితే పత్రికలో దానిని గురించి వరసగా రాసే సూచనలు లేకపోలేదు. పత్రిక చిరకాలము ఆయుర్వేదప్రచారం చేస్తుం దని నమ్ముతున్నాము. మా మిత్రులు గురునాథంగారు, చీలిపోయి వున్న ఆంధ్రాయుర్వేదవైద్యులకు ఐకమత్యం కలిగించే ప్రయత్నాలు కూడా శ్రద్ధగా చెయ్యవలసి వున్నది.

## మహతి

మాసపత్రిక. సంపాదకులు వాసిరెడ్డి వెంకటసుబ్బయ్యగారు. తెనాలి. సంవత్సరం చందా ౨-౦-౦ రాయల్ సైజున ౬౦ పేజీలున్నది. గెటప్పు చక్కగా వున్నది.

ఈమొదటి సంచికలో వున్న రాయప్రోలు సుబ్బారావుగారి తెలుగుబంతీ (పద్యాలు) కొడవటిగంటి కుటుంబరావుగారి సారస్వతసేవకుడూ (చిన్నకథ) శరణు రామస్వామి చౌదరిగారి ఆత్మబలీ (క్యారాక్టర్ అయినీ అను పర్షియన్ యువతి జీవితసఫలత వర్ణించిన చారిత్రిక వ్యాసం), జమ్ములమడక మాధవరామశర్మగారి కావ్యప్రమేయమూ, పత్రిక భాష్యక్షేమవృద్ధికి ఒలమైన సూచకాలై వున్నవి. సంపాదకుల ప్రాస్తావిక పెద్దపెద్ద ఆశలను పురికొల్పుతున్నది: కాని పట్టాభిసీతారామయ్యగారి రచనను, (అణోరణీయాన్ మహతో మహీయాన్) సంపాదకులు ఏమి చూసి, ఏమనుకుని, ఏమి కోరి ప్రకటించారో తోచకుండా వుంది. ఇక ముందయినా సంపాదకులు రచనలవిషయంలో శ్రద్ధకనపరుస్తా రని నమ్ముతున్నాము. మహతి సాఫల్యం పొందా లనన్నీ కోరుతున్నాము.

పాపం, సంపాదకులకు ఈనెల 3 వ తేదీని సత్నివియోగం సంభవించినది. ఉత్కృష్టకార్యనిర్వహణానికి పూనుకున్న కొత్తలో యిలాంటి విపత్తు రావడం చాలా చింతాకరంగా వున్నది. వారికి మా సానుభూతి అందచేస్తూ పత్రిక అభివృద్ధిని కోరుతున్నాము.

---

# హిందీ ముప్పు తెచ్చి పెడుతుంది
# సి. పుల్లయ్యగారి సత్యనారాయణ వ్రతం.

* స్థలాభావంవల్ల యీరెండువ్యాసాలూ ఈసంచికలో ప్రకటించలేకపోయాము. ఇక వచ్చే సంచికలోనే.





# వస్తుగుణప్రకాశిక

సరస్వతీ పవర్ ప్రెస్‌వారి
ప్రచురణము
రాజమండ్రి

పుస్తకములో వస్తుగుణప్రబోధముగల పేజీలు 1000 పైగా నుండును. వెల ప్రతి 1 కి 5—0—0

ఇది సమస్తద్రవ్యగుణములను అసందిగ్ధముగ తెలియజేయు అపూర్వగ్రంథరాజము. ఆంధ్రవైద్యలోకమునకు, వైద్యేతరులకును మిక్కిలి యుపయోగకర మగునటుల బ్రహ్మశ్రీ ఆయుర్వేదభూషణ భిషగ్వర పండిత వీటూరి వాసుదేవశాస్త్రి, ఏ. యం. ఏ. సి. గారిచే వ్రాయబడినది. ఇందు సందిగ్ధద్రవ్యములన్నియు నిర్ధారణచేయబడి ప్రచురింపబడినవి. నూతనపరిశోధితద్రవ్యములు చేర్చబడినవి. వస్తువునందలి రసవీర్య విపాకప్రభావములను గుణములను విడదీసి వస్తుప్రాధాన్యము నిరూపింపబడినది.

## వస్తుగుణప్రకాశిక మాదిరి పేజీ

### కామంచిచెట్టు-కాసరచెట్టు :—కాకమాచీ—Solanum Nigrum.

పరిచయపదములు — బహుఫలా—బహుఫలములు కలది. గుచ్ఛఫలా—గుత్తులుగుత్తులుగాపండ్లుకాయునది. గుణప్రకాశక పదములు రసాయనవరా—రసాయనమునకు శ్రేష్ఠమైనది. కుష్ఠనాశనీ—కుష్ఠరోగమును బోగొట్టునది.

స్వరూపము — దీనినే కాసరచెట్టనియు, గాజుచెట్టనియు గూడ నందురు. ఇది భూమిపైన గజమెత్తు వరకును బెరుగును. దీని కాయలు గుండ్రముగా చిన్నముత్యములవలె గుత్తులుగుత్తులుగా కాయును. కాయనిండా గింజ లుండును. పచ్చికాయ ఆకుపచ్చరంగుగా నుండును. ఎరుపు నలుపు రంగులచే నిది రెండువిధములుగా నున్నది. పండ్ల యొక్క రంగును బట్టియే జాతిని నిర్ణయించవలెను. నల్లజాతి పండ్లు నల్లగాను, ఎఱ్ఱజాతి పండ్లు యెఱ్ఱగాను యుండును. పువ్వులు తెల్లగా నుండును. ఆకు మిరపఆకులను బోలి యుండును.

గుణములు — దీని సర్వాంగములును గూడ కొంచెము కారము చేదును గలిసిన రుచి గలిగి యుండును. ఉష్ణవీర్యము గలది. విపాకమున కారపురుచిగ మారును. విరేచనము జేయు స్వభావము గలది. లఘురూక్షగుణముగల ద్రవ్యము. త్రిదోషములను గూడ శమింపజేయును. కంఠస్వరమును బాగుచేయును. కుష్ఠరోగమును హరించును. వీర్యవృద్ధి గలిగించును. ఇది రసాయనద్రవ్యము. శూలలు, మూలవ్యాధులు హరించును. ఉబ్బు విషదోషములు హరించును. మేహరోగములను తగ్గించును. నేత్రములకు హితమైనది. ఎక్కిళ్లు, వాంతులు, హృద్రోగములు హరించును.

ప్రయోగములు — కుష్ఠరోగమునకు :—కామంచికూర ముద్దగా నూరి పైన నలుగుబెట్టిన కుష్ఠరోగములు శమించును.

విసర్పికి :—చేదుపుచ్చఆకును, కామంచియాకును వేరువేరుగా గాని, కలిపిగాని నూరి పైన రాసిన విసర్పిరోగము శమించును. పై ముద్దలో కొంచెము నెయ్యి కూడ కలపవలెను.

ఉబ్బులకు :—కామంచిఆకు కూర వండి పెట్టిన ఉబ్బులు శమించును.

ఊరుస్థంభమునకు :—కామంచిఆకు నీళ్లతో యుడికించి నూనెలో వేయించి తినిన యూరుస్థంభము హరించును. (చరకము)

ఎలుకవిషమునకు :—కామంచిఆకు స్వరసమును పైన పూసిన యెలుక విషము హరించును. ఆకు రసము రెండు డబ్బులయెత్తు లోనికి తీసికొనినను, విషము హరించును. (శుశ్రుతము)

పిల్లమను నేత్రరోగమునకు :—కామంచిపండ్లు నేతితో నూరి కంటికి ధూపము వేసిన పిల్లమను నేత్రరోగము హరించును. క్రిములు కూడ పడును. కామంచికాయల గింజలు చూర్ణము చేసి కషాయము పెట్టి ఆ కషాయములో తేనె కలిపి త్రాగిన అతిమూత్రములు, మధుమేహము కట్టును.

గ్రామ్య ప్రయోగములు — ఆకు రసము చెవిలో పిండిన కర్ణశూలలు హరించును. చీము కారుట కట్టును. చెవిలో పురుగులు చచ్చును. గర్భోత్పత్తిని గలిగించును.

# సరస్వతీ గ్రంథమండలి

కంభంవారి సత్రమువీధి *** రాజమహేంద్రవరము

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటగొల్పు అచ్చుతో—ముద్దులొలుకు క్యాలికో బయిండుతో—రెండుమాసముల కొక్క-చక్క-ని నవల. నడుమ నడుమ చిన్న చిన్న అనుబంధగ్రంథములు వెలువడుచుండును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0–4–0 చందాదారులు ఒకేసారి రు 7–8–0 ను ముందుగా పంపినచో వరుసగా ఆపుస్తకములు అన్ రిజిస్టర్డు పార్శిలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 11 ప్రేమసుందరి | 1 8 0 | 26 జాగిలము | 1 8 0 | 41 ఛిన్నహస్తము (2 వ భాగము) | 1 8 0 |
| 12 చోరశిఖామణి | 1 8 0 | 27 మొగలాయీదర్బారు 2 భా॥ | 1 8 0 | 42 కంకణరహస్యము | 1 8 0 |
| 13 లక్ష్మీప్రసాదము | 1 8 0 | 28 సరస్వతి | 1 8 0 | 43 సంజీవి (1 వ భాగము) | 1 8 0 |
| 14 హత్యారహస్యము | 1 8 0 | 29 ఆనందాభాయి | 1 8 0 | 44 సంజీవి (2 వ భాగము) | 1 8 0 |
| 51 ఫాస్టు (1 వ భాగము) | 1 8 0 | 30 హత్యాన్వేషణము | 1 8 0 | 45 వ్రజరాణి | 1 8 0 |
| 16 ఫాస్టు (2 వ భాగము) | 1 8 0 | 31 మొగలాయీదర్బారు 3 భా॥ | 1 8 0 | 46 హత్యాభ్రమ | 1 8 0 |
| 17 కుముద్వతి | 1 8 0 | 32 గంగ | 1 8 0 | 47 కాశీఖండము | 1 8 0 |
| 18 చిన్నకోడలు | 1 8 0 | 33 మొగలాయీ దర్బారు 4 భా॥ | 1 8 0 | 48 సేవాశ్రమము (1 వ భాగము) | 1 8 0 |
| 19 రహస్యభేదనము | 1 8 0 | 34 కోహినూరు | 1 8 0 | 49 సేవాశ్రమము (2 వ భాగము) | 1 8 0 |
| 20 సింహగడము | 1 8 0 | 35 ఆటిన్ మగేలా | 1 8 0 | 50 దాసీకన్య | 1 8 0 |
| 21 మణిహారము | 1 8 0 | 36 అపరిచిత | 1 8 0 | 51 స్త్రీ సాహసము ప్రథమభాగము | 1 8 0 |
| 22 మొగలాయీదర్బారు 1 భా॥ | 1 8 0 | 37 అంతఃపురము (1 వ భాగము) | 1 8 0 | 52 స్త్రీసాహసము 2 వ భాగము | 1 8 0 |
| 23 ఘటికాచక్రము | 1 8 0 | 38 అంతఃపురము (2 వ భాగము) | 1 8 0 | 53 మేరీరాణి | 1 8 0 |
| 24 రాజసుందరి | 1 8 0 | 39 అగ్రహారము | 1 8 0 | 54 రాజ్యలక్ష్మి | 1 8 0 |
| 25 కుంకుమభరణి | 1 8 0 | 40 ఛిన్నహస్తము (1 వ భాగము) | 1 8 0 | 55 లీల | 1 0 0 |

## అనుబంధములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మృత్యుతరంగిణి | 0 12 0 | 10 శ్యామల | 1 0 0 | 19 కథావళి | 1 0 0 |
| 2 అభాగిని | 0 12 0 | 11 కాంతంకథలు (చిన్నకథలు) | 1 0 0 | 20 నాలుగుకథలు | 1 0 0 |
| 3 ఛద్మవేషి | 0 12 0 | 12 కాలసర్పి | 1 0 0 | 21 నీతిప్రబోధిక | 1 0 0 |
| 4 విదురుని యుపదేశములు | 1 0 0 | 13 భారతకథాసారం | 1 0 0 | 22 ఆదర్శము (1 వ భాగము) | 0 12 0 |
| 5 కాంచనమాల | 1 0 0 | 14 కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 0 0 | 23 ఉదంకుడు | 0 12 0 |
| 6 సీమంతిని | 1 0 0 | 15 అరక్షణీయ | 1 0 0 | 24 భేతాళకథలు | 0 12 0 |
| 7 సుశీల | 1 0 0 | 16 మాధవి | 1 0 0 | 25 దయ్యాలు | 0 12 0 |
| 8 శశిరేఖ | 1 0 0 | 17 లలిత | 1 0 0 | | |
| 9 యమునాబాయి | 1 0 0 | 18 పెండ్లిదండ | 1 0 0 | | |

## నాటకములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 మార్కండేయ | 0 12 0 | 5 షాజహాను | 1 0 0 | 9 దంపతులు | 1 0 0 |
| 2 అహల్యాశాపవిమోచనము | 0 12 0 | 6 నూర్జహాను | 1 0 0 | 10 విజయవిజయం | 1 0 0 |
| 3 మీవాడుపతనము | 1 0 0 | 7 దుర్గాదాసు | 1 0 0 | 11 భక్తకుచేల | 1 0 0 |
| 4 వరమాల | 1 0 0 | 8 చంద్రగుప్త | 1 0 0 | | |

 ఈ గ్రంథములు రాజమండ్రీలో కలాభివర్ధనీ పరిషత్తులోను దొరకును